

# పాదుకాపట్టాభిషేకము.

"ఆంధ్రనాటక పితామహ" యను బిరుదువహించిన

ధర్మవరము రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారి సహోదరులవలనఁ బ్రకటింపఁబడియె.

ఐదవ కూర్పు.

బళ్ళారి.

భువనేశ్వరి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1932



క్రయము రూ. 1-4-0.



# ఈ నాటకమున వచ్చుపాత్రలు తత్ప్రవేశస్థలము.

---

1. దశరథుఁడు—(అయోధ్యరాజు) (పూర్వ రం. 1, 2, 3,) అం. I రం. 1, 2. అం. II రం. 3. అం. III రం. 2.
2. రాముఁడు—(దశరథుపుత్రుఁడు) అం. I రం. 1, 2 అం. II రం. 1, 2, 3, అం. V రం. 1, 2.
3. లక్ష్మణుఁడు—అం. II రం. 2. 3 అం. V రం. 1, 2.
4. భరతుఁడు—అం. IV రం. 1, 2, 3, 4 అం. V అం. 1, 2.
5. శత్రుఘ్నుఁడు—అం. IV రం. 1, 2, 4 అం. V రం. 1, 2.
6. సుమంత్రుఁడు—(దశరథుని మంత్రి) పూర్వరం. I అం. 1 రం 1, 2 అం. II రం. 3.
7. వసిష్ఠుఁడు—(రాజగురువు) అం. I రం. 1 రం. II రం. 3 అం. III రం. 2 అం. IV 4 అం. V రం. 2.

## స్త్రీలు.

8. కౌసల్య—(దశరథుని పట్టపుభార్య-రామునితల్లి) అం. II రం. 1, 3 రం. III రం. 2 అం. IV రం. 4 అం. V రం. 2.
9. కైకేయి—(దశరథునిభార్య-భరతునితల్లి) అం. I రం. 2 అం. II రం. 3 అం. III రం. 2 అం. IV రం. 2, 4 అం. V రం. 2.
10. సుమిత్ర—(దశరథునిభార్య-లక్ష్మణశత్రుఘ్నులతల్లి) అం. II రం. 3 అం. III రం. V రం. 2.
11. సీత—(రామునిభార్య) అం. II రం. 2, 3 అం. V రం. 1, 2.
12. మంథర—(కైకదాసి) అం. 1 రం. 2 అం. II రం. 3 అం. అం. *III* రం. 1 అం. IV రం. 2.

(పౌరులు. సేవకులు. మొదలగువారు.)

# పాదుకాపట్టాభిషేకము.

## కథాసంగ్రహము.

### ప్రథమాంకము.

రం. 1. దశరథుఁడు తనదుస్స్వప్నముఁ గాంచి రాముని సమ్మతింపఁజేసి పట్టాభిషేకము చేయనెంచుట.

రం. 2. కైకేయి చెలికత్తెయగు మంథరయొక్క దురాలోచన. తనమగఁడు తన్ను చులుకన చేసినాఁడని దృష్టాంతయుక్తముగ కైకకు మంథర బోధించుట. దశరథుని కైక వరము లడుగుట. దశరథుని దుఃఖము రాముఁడూఱార్చుట.

### ద్వితీయాంకము.

రం. 1. పట్టాభిషేకము నిలుచుటయు తాను అరణ్యమునకుఁ బోవలసివచ్చుటయు రాముఁడు తనతల్లి కౌసల్యకుఁ జెప్పఁగా నామెయు దుఃఖము

రం. 2. రాముఁడు సీతనూఱార్చి యామెయు నరణ్యమునకువచ్చుట కనుజ్ఞయిచ్చుట.

రం. 3. మంథర దురాలోచనయొక్క సంపూర్ణదశ. రామాదులు దశరథుని సేవించుట లక్ష్మణుని మహాగ్రహము తుదికతఁడు రాముని వెంట పోవ నేర్పడుట కౌసల్య యాశీర్వాదము. వియోగము. పౌరులు చెలరేగుట. వారిని రాముఁడు సమాధానపరచుట. (మహాకరుణరస భూయిష్ఠరంగము.)

### తృతీయాంకము

రం. 1. కైకేయియొక్క చాంచల్యము. మంథరయొక్క కుయుక్తి సమాధానము.

రం. 2. దశరథుని ప్రలాపసన్ని. అతనినిర్యాణము.

### చతుర్థాంకము.

రం 1. భరతశత్రుఘ్నులయోధ్యకు వచ్చుట. వారికైన దుశ్శకునములు.

రం. 2 భరతుఁడు తనతల్లివలన యావద్దుఃఖవృత్తాంతమును, వినియామె దౌరాత్మ్యమును నెఱుఁగుట.

రం. 3. భరతుని స్వగత సంతాపము (మిక్కిలి దుఃఖకరమైన రంగము).

రం. 4. కౌసల్యయొద్దకు భరతుఁడువచ్చుట కౌసల్య యుచితాపవాదము. భరతుని సంతాప వాక్యసమితి. (మిక్కిలి శోకము గలిగించు రంగము).

### పంచమాంకము.

రం. 1. వనమున సీతారాముల మోహనమధురసంభాషణము భరతాగమనము. లక్ష్మణుని యాకుంభావము, రామ భరత సమాగమము.

రం. 2 రాముని మరలించి రాజ్యమిచ్చుటకై భరతుని నిరర్థక ప్రయత్నము. రామపాదుకా పట్టాభిషేకము.

— మంగళము —



# ఉపోద్ఘాతము.

(బి. కె. గురురాజరావుగారు బి. యే., బి. యల్., బళ్ళారి.)

ఈ నాటకమాంధ్రదేశము నందంతయు విఖ్యాతిగని, యాంధ్రనాటకపితామహుఁ డను బిరుదముఁ బొందిన, యనేక నాటకరాజముల రచించి యాంధ్రమాతృ సేవను మనసారఁ జేసిన ధర్మవరము రామకృష్ణమాచార్యులవారిచే రచింపఁబడినది. ఈ కవితల్లజుఁ డాంధ్రనాటకముల రచించుటలో నవీన ఫక్కిని ద్రొక్కి యాంధ్రనాటకకళకు వింత వన్నె వెట్టెననుట సర్వజనసమ్మతము. ఈ కవిచే రచింపఁబడిన పెక్కు నాటకములు, సుప్రసిద్ధమగు సరసవినోదినీ సభవారిచే నాంధ్రదేశమందేగాక యితర ప్రదేశములందుఁ గూడఁ బ్రదర్శింపఁబడి దిదృక్షుల హృదయముల నాకర్షించి వారి మన్ననవడసెననుట యెల్లరకుఁ దెలిసిన విషయమే.

ఈ నాటకమునందలి యితివృత్తము వాల్మీకిరామాయణమునుండి గ్రహింపఁబడియున్నను, నాటకరంగమున కెక్కించుటకుఁ దగిన రీతిని, నందందు కథాసంవిధానమున సందర్భోచితముగఁ గొన్ని మార్పులు గావింపఁబడియున్నవి. కవులనిరంకుశులను రీతినిగథాసంవిధానమునను వన్నెవెట్టుటకునై సకారణములైన మార్పులుకొన్ని గావించియున్నాఁడనుట యిందలి ప్రస్తావనవలననే దెలియవచ్చుచున్నది.

పాత్రసంభాషణ మీకవికి వెన్నతోఁ బెట్టినది. ఇతని పూర్వకవులును సమకాలికులును మఱియుఁ దరువాతివారును నగునాటకకర్తలనేకనాటకముల రచించియున్నను బాత్రపోషణలో నితఁ డగ్రగణ్యుఁ డనుటలో నతిశయోక్తి యుండఁజాలదని నానమ్మకము. ఈకవి నాటకరచనలో గీర్వాణకవులు దృశ్యప్రబంధరచనావిషయమున నేర్పరచిననిబంధనలఁ గట్టుదిట్టముల గమనింపక పోయినను, జగత్ప్రసిద్ధుఁడగు "షేక్స్పియర్" అను నాంగ్లనాటకకర్తను గొన్నియంశముల

ననుకరించి యున్నాఁడు. గీర్వాణనాటకరచనా సాంప్రదాయమునకు విరుద్ధముగ నీకవి, సాగంగధరనాటకమును విషాదాంతముగనొనరించి యుండుట షేక్స్పియర్ మహాకవియొక్క యనుకరణను స్పష్టముగ సూచించుచున్నది. షేక్స్పియర్ మహాకవిరచించినవిషాదాంతనాటకములలోని దుష్ట (Villainous) పాత్రలీకవినాటకములలోను గలవు. సారంగధరలోని చిత్రాంగిపాత్రయు నీనాటకములోని మంథరయు నట్టిపాత్రలేకాని షేక్స్పియర్ మహాకవి పోషించియుండుదుష్టపాత్రలకును, నీకవిపోషించియుండునట్టిపాత్రలకును నొకముఖ్యాంతరమ్మ్యాము మనము చూడఁగలము. ఆకవిచేఁ బోషింపబడిన దుష్టపాత్రలు సకలసద్గుణములకిరవైన యాదర్శప్రాయమైన యొకవ్యక్తిని తమదుర్బోధనకు లోఁజేసికొని పలువిధములుగ దురాశఁగొలిపి తమదుష్పథమున కావ్యక్తినిదప్పకయీడ్చుటను మనమంతటనుగఁజూచుచున్నాము. ఈకవిచే రచింపఁబడిన నాటకములలో నట్లుగాక, యెన్నిదుర్బోధనలకుఁ జిక్కినను నెన్నికపటోపాయములపాలైనను వానికి లోనుగాక సహజసౌశీల్యప్రభావముచే వాని నన్నింటి నణఁగఁద్రొక్కి తమసత్పథమును దప్పనిమహాపురుషులు కానవచ్చుచున్నారు. మచ్చునకుగాను గొన్నింటి నుదాహరింపవలెనన్న “అయాగో” యనుదురాత్ముని దుష్టోపాయములకులోనై “ఒథెల్లో” యనుసత్పురుషుఁడు తనకత్యంతప్రీతిపాత్రమై సుగుణమూర్తి యగుతన ప్రేయసిని దనచేతులార నిష్కారణముగఁ జంపినాఁడు. ఈకవిచే రచింపఁబడిన సారంగధరనాటకములోని సారంగధరుఁడు చిత్రాంగియొక్క దౌరాత్మ్యమునకుఁ జిక్కి యామెతనకపట కృత్యములచే సారంగధరుని ప్రాణములకెక్కువెట్టినను, దనధర్మపథము నుండి దప్పక ప్రవర్తించుటను జూచుచున్నాము. ఈనాటకములో మంథర తనకపటోపాయములచే భరతుని దన వలలో వేసికొనుటకుఁ బ్రయత్నించినను సద్గుణఖని యగుభరతుఁడు మంథర ప్రయత్నముల నతి తుచ్ఛముగఁ జూచుచున్నాఁడు.

## మంథర

ఈ నాటకములో మంథరపాత్రము నొక ప్రధాన పాత్రముగఁ గవిపోషించియున్నాఁడు. ఆమె మూలముననే కథాసంవిధాన రచన చాలవఱకు రసవంతముగ నొనర్పఁబడియున్నది మంథర సహజముగ దుశ్శీల. పరులసంతోషమునుజూచియోర్వఁజాలనిదుష్టహృదయ. అకారణ వైరమును సాధించి పరుల నిడుమల పాలు చేయుటయే యామె మతము. “ఆహా! పురమంతయు నలంకరింపఁబడుచున్నది. ఎవ్వరుచూచినను నగుమొగము లలరార స్వర్గమేలఁ గలిగినట్లు సంతోషభరితులై యున్నారు. రామునికిఁ బట్టాభిషేకమైన నీజనులకేమి? తమకే యభిషేకమగునట్లుత్సాహముఁజెంది యున్నారు. ఈదుఃఖము నేఁ జూచి యోర్వఁగలనా”

మంథరమిగుల చతుర. నానావిధములఁ దన్ను కైకేయి విశ్వసించునట్లామెకు దుర్బోధగావించి లోఁజేసికొనుచున్నది. “నాకేమైనదని నీయిచ్చచొప్పునఁ జెడిపోవుదువుగాని మీతండ్రి నిన్నత్తగారింటికిఁ బంపునపుడు నిన్ను నాకిల్లడ వెట్టినాఁడే నేనెట్లూరకుందును. నాకన్నుల నీవు చెడిపోవుట చూడఁజాల” అని తాను కైకకు మిక్కిలి యాప్తురాలని చెప్పుకొనుచున్నది.

మంథర మిగులతగులుమారి యనిజను లనుకొనుట తానెఱుఁగును. తానెవ్వరికేమపకారము సేయకున్నను బురజనులందఱుదన్ను దిరస్కరించెద రనియుఁ దానుపోయిన, మాటలాడుచున్నవారందఱు మాట లుడిగి తాను వెడలివచ్చు నంతవఱకు నందఱు మౌనముద్ర వహింతురనియుఁ దానెఱుఁగును. అందుచేఁదనుఁదిరస్కరించునయోధ్యాపురివారి కొకగుఱుతైనఁ జేయక పోవచ్చునా యనియుఁ దన ప్రభావ మాపురివారికిఁ జూపవలెననియు సమయము నిరీక్షించుచుండి రామునికి నరణ్యపట్టాభిషేకముఁ జేయించుమూలమునఁ బురివారి కశ్రుజలాభిషేకముఁ గావింపవలెనని కృతనిశ్చయయై తాను దలపోసిన దుష్కార్యమును సఫలీకృతముగఁ జేయుట కమాయికురాలగు కైకను సాధనముగ నుపయోగించుకొనుచున్నది.

మంథర మిగుల సాహసవతి. సహజముగఁ గైకకు రాముని పై మిక్కిలి ప్రేమ కలదని తెలిసి, యామెను దనమార్గమున కీడ్చికొనుటకుఁ దగిన సాహస మొనరించుచున్నది.

కైక—"నేను కౌసల్యదాసినైన నగుదునుగాని యట్టిదుశ్చరితమునకు నేనియ్యకొందునా?"

"అయ్యెద రాజ్యబహిష్కృత నయ్యెదఁ గౌసల్యదాసినై ననకట నా నెయ్యంపు సుతుని గానల కెయ్యాపనుపంగ నెట్టు లడుగుదు నబలా" యనిమిక్కిలి పరితపించినకైకి మంథరదుర్బోధనయనువిషము తలకెక్కినతరువాత "మంథరా! ఇట్టి సమయమున ననుఁ జేవిడువ వచ్చునా? నమస్కరించి వేఁడికొందును పోకుము" అని దీనముగఁ బ్రార్థించుచున్నది. దీనివలననే మంథరయొక్క బుద్ధికుశలత స్పష్టమగుచున్నది.

మంథరకుఁ గైకయెడ మిక్కిలిచనవు. ఆమె పుట్టినింటి నుండి తండ్రి తనకు బ్రేమాస్పదకై పంపియున్న పరిచారిణియో లేక తోడుకత్తెయో యగుటఁ జేసి రాజు భార్యయే యనుకొంకు కొంచెమైనను లేక మిక్కిలి చనవుతో మెలఁగుచున్నది.

కైక—"ఆసంతాపమున నానాథుఁడు జీవింపఁగలఁడాయని సంశయము పుట్టుచున్నది"

మంథర—పీడ వీడినది.

కైక—"దుర్జాతి విధవా! ఇంత చేసి యిట్లాడెదవా"?

మంథర—"నీవు కానున్నా నంటిని. నన్నేలవిధవాయనెదవు" అని ప్రత్యుత్తర మొసంగినది.

మంథరకుఁ దన మేర తనకుఁ దెలియదు. దానికి భరతునిపై మోహము పుట్టుచున్నది. కామమునకు కన్నులు లేవనులోకోక్తి ననుసరించి కాఁబోలు భరతుఁడు తనయభీష్టమునకు సదుత్తరమిచ్చిన నీవచ్చునని పొంగవడుచున్నది. ఏపుట్ట నెంతపాముండుటయూ నెవ్వరెఱుంగుదురని భ్రమపడుచున్నది. తుదకుఁ దానుభరతునకు వ్రాసిన జాబే తనమరణమునకు హేతువుగఁ బరిణమించెను.

## కైక.

ఈమె సద్వంశ సంభూత యగుటచే నైజముగ సుస్వభావముగల వనిత. మిక్కిలి యమాయకురాలు. రాముఁడు సవతికొడుకను భేదబుద్ధియేనాఁడును నెంచి యెఱుఁగని యుదార మానసముగల యువతి. మంథర యను పిశాచమామెనుబట్టి పీడించువఱకు నామె భరతునకుఁ బట్టాభిషేకముగావింపవలెనని తలపెట్టియుండలేదు. అటు తరువాత నైనను, రామునిపైనిమాతృప్రేమనువీడఁజాలక "మంథరా! యిట్టి మాటలాడకుము. ఆ రామునిపై నీవు పగసాధించెదవా? ఆ రాముఁ డెవ్వరనుకొన్నావు? నా కూర్మిసుతుఁడు. వానికిఁ బట్టాభిషేకమైన నాకుఁబరమభాగ్యముగదా? మంథరా! నీవేమన్నను నా కా కౌసల్యాసుతునిపైఁ గూర్మిమానదు. అయ్యో! రాముని నీవిట్లనవలదు" అని మంథరకుఁ దనమనోభావమును వెలిఁబుచ్చుచున్నది. రాముని గుణాతిశయము లామె మనోవీధిఁజక్కఁగ నాటియుండెను. భరతుని కంటె రాముఁడు తనయెడ నెక్కుడు భక్తిగలవాఁడని యెఱిఁగి యామె మంథర దుర్బోధనకుఁ జిక్కువఱకు రామునం దత్యంత మాతృవాత్సల్యమును నెఱపి తనకుమారుఁ డగు భరతునివలె భావించియుండెను. మంథర యామెనుజెడుత్రోవ కీడ్చుట కెంతయో ప్రయాసపడుచున్నది.

మంథర—నీపతికినీపై మోహము గలదని యెంచియున్నావా చెప్పుము.

కైక—నా కేమియు సందేహము దోఁపదు.

మంథర—కైపు తలకెక్కినపుడేల తోఁచును.

కైక—అది యేమే యతనికి రాముఁడు వేఱె భరతుఁడు వేఱెయా? అని యామె మంథర యొక్క ప్రశ్నలకన్నిటికిని సమాధానములు చెప్పుము రామునియందను రాగమును దనమనోవృత్తి యొక్క నిర్మాలిన్యమును దనయమాయకత్వమును బ్రకటించుచున్నది.

మంథర యొక్క దుర్బోధనకుఁ జిక్కినతరువాతఁగూడ నామెనుస్వభావము మాఱినదికాదు. రాముఁడరణ్యమునకుఁ బోవుటకుఁ మునుపే యామెకుఁబశ్చాత్తాపము కలుగును "మంథరా! ఎంతకార్యమాయెనే!

ఏమి యుత్పాతముకలిగెనే! నాపతి సంతాపము చెప్పఁజాల. ఇంతగు నని యెఱుఁగ" నని తాను చేసిన మహాపరాధముయొక్క ఫలమును స్మరణకుఁ దెచ్చుకొని దిగులు పడుచున్నది. కాని మంథర పన్నిన కపటోపాయముల వాగురలఁ జిక్కి వెలుపలికి రాఁ జాలకమరల "మంథరా! నీమాట నిక్కము ఇప్పుడువెనుదీసిన నపకీర్తియొక్కటియే నిలుచు. నీవలె హితము చెప్పువారు నాకు లేరు. నీయుపకారమున కేమొనర్తును. కొమ్మా యీచంద్రహారము" అనిమరల వెనుదీయు చున్నది. ఆమెసైజముగ సౌహార్ద్ర.

"భరతునికిఁబట్టముగట్ట వరమడుగుము కాని రామునరణ్యము నకుఁబంపు వరమడుగకు" మని కౌసల్యాసుమిత్రలు చేతులంటిబతిమాలి నపుడామెహృదయముకరఁగినదైరై యేమియుఁ బ్రత్యుత్తరముఁ జెప్పలేక మంథరను జూచుచున్నది. మంథర వలదనిసైగచేయఁగా మరల కాఠిన్యమును వహించుచున్నది

తుదకు: దాను గావించిన మహాపరాధముయొక్క ఫలము దనకు వైధవ్యము దెచ్చునని విలపించుటయుఁ గౌసల్యాసుమిత్రాదు లకుఁ బట్టరాని దుఃఖము గలిగించి వారియెడఁ దాను మహాపరాధము గావించి నందులకై వారిక్షమాపణ వేఁడుటయు నామెయొక్క సహజ సుస్వభావమును మంథరయొక్క దౌరాత్మ్యమును బ్రబలముగఁజాటు చున్నవి. తుదకుఁ దనదుశ్చరితమునకుఁ గారణము తానే యిట్లు చెప్పు కొనుచున్నది— "ఆమంథర నాపాలి విధివోలెఁ బీడించెను. ఎంత బుద్ధితిరిగినను మానక యుపదేశించెను ఒక్కపాపము వేఱొక్క పాప మునకుఁ దెఱువుఁజూపెను. ఒక్కసారిపాపమొనర్చిన కఠినహృదయము దాని మెత్తబఱచు సందర్భములు గలిగినట్లంతయు మఱింత కఠిన మగుచువచ్చె. ఇట్లయి యీగతికి వచ్చితి."

భరతుఁడు.

ఇతఁడు కేవల నిష్కలుషుఁడు. రామునియం దపారభక్తిగల తమ్ముఁడు. పితృభక్తిపరాయణుఁడు. కేవల ధర్మాసక్తుఁడు సీతయం దితఁడు భక్తియు ననురాగమును గలవాఁడు. ఆమెపరమసాధ్వీలలామ

యునియు నా మొకుఁదన యెడనపారమగు పుత్రప్రేమ గలదనియు నాతని దృఢవిశ్వాసము. అందఱి దుఃఖములకుఁ దనజన్మమే కారణమని నిందించుకొనుచున్నాఁడు. కైకకేల జనియించితినని తిట్టుకొనుచున్నాఁడు. "తలయెత్తరాని నిందలమోచి దుష్కీర్తినవనిపై నిఁకఁదిరుగాడఁగలనే" యని విలపించుచున్నాఁడు. ఎవ్వరుతన్ను దప్పుదలఁచినను కౌసల్యాదేవి తప్పుదలఁచియుండదను నమ్మకము వమ్మయినపుడాతని సంతాపమునకు మేరయే లేదు. మిన్నువిఱిగి పైఁబడినంతటి దుఃఖ మతనికిఁగలిగెను. తుదకు రాముని సందర్శించి యాతని మరలఁ బిలిచికొనివచ్చి పట్టాభిషేక మొనరించుటకుఁ బ్రయత్నించెను. కాని పితృవాక్య పరిపాలనాదీక్ష వహించిన రాముఁడియ్యకొనక పోవుటఁజేసి యతని పాదుకలకుఁ బట్టముగట్టి మనశ్శాంతి బొందెను.

ఈకవికిఁ గరుణారసమును బోషించుటలో నసాధారణ ప్రజ్ఞయన్నట్లీనాటకము వలననే తెలియవచ్చుచున్నది ఎట్టికఠినహృదయునకైనను, దశరథునిపుత్రశోకము కంటనీరు తేక మానదు. పుత్రశోకమనుభవైక వేద్యమైనను, నీకవి దానిఁ బ్రదర్శించుపట్లఁ జదువరులశోకసముద్రమున ముంచుచున్నాఁడు. దశరథుఁడు తుదకుఁ బుత్రశోకమున మడిసెననుట కేవల సహజముగఁ గన్పట్టునటుల నీకవి దశరథుని పాత్రను బోషించినాఁడు.

"సడలించుశోకంబు సాక్షి చాలకయున్న నేచచ్చినట్లైన నెఱుఁగవన్న" అనిదశరథుఁడు తనసంతాపమును వెలిఁబుచ్చినపుడు పుత్రశోకము మూర్తీభవించి నట్లగపడుచుయు నతఁడప్పట్లే యాశోకముచేత నేమృతిఁ బొందుటయుఁ జూడనగు.

ఈకవియొక్క గద్యశైలి యనర్గళమై ద్రాక్షారసపాకమునఁ దనరి మృదుమధురమై పండితపామరజనమనోరంజకమై నాటకశైలికి మిక్కిలియుచితమై మద్దులమూటగట్టు మాటలతోను సులలితములగు వాక్యజాలములతోను నలరారుచున్నది. ఈకవిచేఁ బోషింపఁబడిన

పాత్రముల పరస్పర సంభాషణశైలి మిక్కిలి యౌచిత్యమును గలిగి కడుమనోహరముగనున్నది. నాతికఠినములై రసభరితములై శ్రావ్యములైన మాటలనే ప్రయోగముచేసి ముక్తాహారములఁబోలు వాక్యముల నీనాటకమునందు నింపియున్నాఁడు. చదువరుల హృదయముల నాకర్షించి తనవెంటగొనిపోవుశైలి యీకవికబ్బియుంట యాతనిభాగ్యము.

ఈకవియొక్క పద్యశైలి మిక్కిలి మధురముగనున్నది శ్రవ్యకావ్యమగు ప్రబంధశైలి ఫక్కికిని దృశ్యకావ్య మగునాటక శైలి ఫక్కికిని దారతమ్యముండి తీరవలెనని యెంచికాఁబోలు నీకవి మిక్కిలి సులభశైలినే పద్యముల నల్లినట్లు దోఁచెడిని. తానే నాటకరంగము నెక్కిపాత్రములఁ గైకొనిన నటశేఖరుఁడగుటఁజేసి దిదృక్షులహృదయముల నాకర్షింపఁ గలయట్టి సమయోచిత పద్యములఁ బొందుగొలిపియున్నాఁడు. ఈకవియొక్క కీర్తిచంద్రికలు దశదిశలవ్యాపించియున్నవనుట ప్రతియాంధ్రునకుఁ దెలిసిన విషయమే. కేవల నీతిబోధకములగునాటకములఁగడుసుబోధకములుగ రచించియుండుటచేఁ బ్రతియాంధ్రునియింట నీకవినాటకములు పఠింపఁబడుచుంటను దఱచుగఁ జూడనగు ప్రతిదినము నీకవిచేర చింపఁబడిననాటకముల నేకములయమ్మకమే యాంధ్రుల కీతనినాటకములఁ బఠించుటలోఁగల యుత్సాహమును జాటుచున్నది.

ఈకవికీర్తి యాచంద్రతారార్కముగా విలసిల్లుఁగాక.





**Bellary· D· KRISHNAMA CHARLU,**

**Andhra Nataka Pithamaha,**

Born 1853—Died 1912.



# పాదుకాపట్టాభిషేకము.

## ప్రస్తావన.

శా॥ శ్రీమీనాక్షీవిలాససుందర ధరిత్రీ జాతమై సంతతం
బామోదంబు ఘటింపఁదల్పఘననాగాధీశుఁడాసన్నుఁడై
సౌమిత్రిప్రథితాభిధానమునఁ దాసైదోడుగా నొప్పునా
రాముండీవుత భక్తసంతతులకుః రారాజదైశ్వర్యముల్.

### అనుబంధము 1.

సూత్ర—నటీ! యిటురమ్మా.

[ ప్రవేశము: నటి. ]

నటి—ఆర్య! సెలవేమి?

సూత్ర—చూడుమీయెడవానాశాస్త్రకోవిదులును, సంగీత సాహిత్య విశారదులునగు విజ్ఞమండలి చేరియున్నది. వీరిమానసముఁ ఱెంపగు విధానమున నేదేని నాటకముం బ్రదర్శింతమని యభిలాష వొడమి నీయోచనఁగోరి యాహ్వానమొనర్చితి.

నటి—ఇందుకు నాయాలోచనయేల? ఏదోయొక యాంధ్రనాటకముం బ్రదర్శింపుము.

సూత్ర—ఏదో నాటకమన్న నేమి? భాషావైశద్యమునను, సంవిధాన చమత్కృతివలనను సర్వజనముల మానసముల రంజింపఁదగు నాటకముగదా ప్రదర్శనీయము.

నటి—అయినఁ జెప్పుము పురాణకథయా, కల్పనాకథయా, లేక చరిత్రారూపకమా వీరిసంతోష పెట్టఁజాలినది?

సూత్ర—ఏకథయయిన నేమి! రసస్ఫూర్తికలిగియుండవలయుఁగదా? కథయెట్టిదయినను దత్కూర్తఁగదా విచారింపవలయు?

నటి—అయిన నాంధ్రనాటక పితామహాయనిఖ్యాతిఁ జెందిన రామకృష్ణకవీంద్రునాటకమేదైనఁ బ్రదర్శింపఁదగు.

సూత్ర—నాకు నట్లేతోఁచుచున్నది.

నటి—అయిన నేనాటకముం బ్రదర్శింప నెంచితివి?

**సూత్ర**—ఆహా! జ్ఞాపకమువచ్చె. ఆకవీంద్రు డెన్నియో నాటకములు రచియించియున్నాఁడు అందు విషాదాంతము కాకయుండినను బ్రుద్ధినున్నయన్ని విషాదనాటకములకును మిన్నయన్నవన్నెఁగన్న చెన్నున మహర్షిపుంగవుండగు వాల్మీకి తనరామాయణమునన యోధ్యాకాండమురచియించియున్నాఁడుగదా, అందలికథయె తత్కవిపుంగవుండు నాటకరూపముగ రచియించియున్నాఁడు. దానిం బ్రదర్శింతము.

**నటి**—ఒకానొకప్పుడు మనము విచారించియుండలేదా యాకథలోనియంశములకొన్ని విషయముల సందేహములు తీఱలేను. భరతుఁడు లేనికాలమున దశరథుఁడు రామపట్టాభిషేకకార్య మేలదలపెట్టవలయును? తలపెట్టెఁబో మూఁడుదినముల ప్రయాణమని తెలియవచ్చిన గిరివ్రజపురమున నున్న భరతశత్రుఘ్నుల నేల పట్టాభిషేకమునకుఁ బిలువఁ బంపలేదు? ఎన్నియేండ్లనుండియొ మగనితో సంసారమొనర్చుచున్న కైకేయి యొక మంథర చెప్పినమాత్రముననే రామునిపైఁ బగబట్టవచ్చునా? పోనీ! కైకేయి స్వభావమువలననే పాపకర్మురాలా? లేక మంథర బోధనవిశేషమా? మంథరకు కైక మనసు ద్రిప్పునట్టి కారణము లేవియెట్టివి చూపించె? కైకవరములడిగెఁగదా? రామునకు రాజ్యమీయకుండనడుగవచ్చుఁగాక, యాతని నరణ్యమునకుఁ బంపునట్లును, అట్లు పదునాలుగేండ్లును, అందునుఁ దపసివృత్తిమై నుండునట్లును గోరను కారణమేమి? వరములిచ్చినను, భరతు నేల తర్వాతనైనఁ బిలిపింపలేదు? తుదకు రాముఁ డరణ్యమునకుఁ బోయినపిదపనైన భరతున కేల యీవృత్తాంతము చెప్పలేదు? అటు చెప్పనంపియుండిన దశరథుఁడు మృతిజెందకమును పే భరతుఁడే తెంచి రాముని బిలుచుకొని వచ్చుచుండెనే. వినికన్నిటికి సమాధానములం గనఁబడవని యాలోచింపలేదా? అట్టిది నాటకరూపమైన నెట్లలరింపఁగలము!

**సూత్ర**—ఏల యోచించెదవు? వీనికన్నిటికిని బ్రత్యుత్తరముల నీయిందుఁ బడయంగలవు, ప్రొద్దుపోయెను. ఇంక నాటకమున కుపక్రమింతము. ఈనాటకమున నీకవి మంగళాచరణముననె మహాకవియగు వాల్మీకిం బ్రస్తుతించియున్నాఁడు. ఆకవీంద్రునకు సరస్వతి ప్రత్యక్షమనుటకు సందేహము లేదు. ఆదికావ్యమన్నను, ఆదిప్రబంధమన్నను, ఆదినాటకమన్నను, దగినది యనిపించుకొను రామాయణము నామహాకవి రచియించియున్నాఁడు.

ఉ॥ ప్రాకటమంజు సంస్కృత సరస్వతి ధీరపదార్థగౌరవా।
నేకతవిల్లసిల్లఁగవు లెవ్వరు వ్రేలిడ నేరకుండఁగా।
నేకవిలోకమౌళి రచియించెను రాముచరిత్రమట్టి వా।
ల్మీకిలసద్వివేకి జిదమేయపినాకి నమస్కరించెదన్ ॥

ఏకీ యతనికిఁ బ్రత్యక్షముగానున్న యావాగ్దేవి నీవింత ప్రశంసింపుము.

**నటి**—  అనుబంధము

**సూత్ర**—రమ్మింకఁ బోవుదము. (నిష్క్రమింతురు).



# పాదుకాపట్టాభిషేకము.



## పూర్వరంగము.

### ప్రథమ ప్రకరణము-అయోధ్య-దశరథునాస్థానము.



[ ప్ర: దశరథుఁడు, సుమంత్రుఁడు, వసిష్ఠుఁడు, సేవకుఁడు. ]

వసిష్ఠుఁడు—రాజేంద్రా! దేవేంద్రుఁడు నిన్నొక పనికై యపేక్షించుచు, తనసారథిని మాతలి నిందు పంపియున్నాఁడు.

[ ప్రవేశము: మాతలి ]

మాతలి—దశరథరాజన్యా! విజయోస్తు. శంబరాసురుఁడు సురపురిపైఁ దండెత్తి వచ్చుటకు సర్వసన్నాహములు చేయుచున్నాఁడని విని దేవేంద్రుఁడు నను నీయొద్దకుఁ బంపినాఁడు. ఇక్ష్వాకుకుల సంభవు లెల్లరుం దనకు బరమమిత్రులనియు, దానం జేసి నీవును బరమప్రీతి పాత్రుఁడవనియు నీవు తనకు సహాయముగా రాఁగోరితివనియుఁ జెప్పుమన్నాఁడు. గురుప్రసాదమున శబ్దవేదిసాయకముల పరిచయము నీకలవడియుండుటచే నామాయావితో నీవ సంగ్రామము చేయంగదువనియు నన్నాఁడు. ఈవసిష్ఠ ఋషియు నినుఁ బ్రశంసించినాఁడు.

దశ—మాతలీ! నేనాయమరేంద్రుని భృత్య భృత్యుండను. రమ్మని యానతిచ్చిన శిరసా వహింతును. కనదద్రిపక్షనిచ్ఛేద దక్షమై, వృత్రాద్యభ్యమిత్రగాత్ర లతాలవిత్రాయమానమైయున్న వజ్రముగల పాకారికిఁ జేకూడని సంగ్రామమొండుండునా? నను రమ్మనుట నాపైఁ బ్రీతివిశేషము కాక. అవశ్యమానతి నెఱవేర్చెదను.

క॥ చిత్రవిధంబునఁ బ్రీతికిఁ
బాత్రుఁడఁగా దేని గోత్రపత్రహరున కా
వృత్రప్రభంజనున కతి
మాత్రమె శంబర సురారిమథనంబె ముక్ ॥

**మాతలి**—రాజేంద్రా! నీవాడినది నిక్కము సమరము నిశ్చితమైన వెంట నేఁవచ్చెదను. పునర్దర్శనమయ్యెడు.

**వసి**—రాజేంద్రా! నేనును బోవఁదగియున్నది. పోయివచ్చెద.

**మాతలి** }
**వసిష్ఠ** } (నిష్క్రమింతురు)

**దశ**—సుమంత్రా! చూచితివే యింద్రునియనుగ్రహము? నేనుశబ్దవేది పాయకాభ్యాసమునకు సరయూతటంబునకుఁబోయెద. దానికిఁ దగినట్లు చీఁకటిరాత్రులును వచ్చియున్నవి. నామోహనాంగి కైకేయి నేను యుద్ధమాడుట చూడవలయునని యభిలషించినది. అదియు నెఱవేఱఁగలదు. ఇంకఁబోదము. (నిష్క్ర)



## పూర్వరంగము.

### ద్వితీయప్రకరణము-సరయూతటము.

---

[ ప్రవేశము: దశరథుఁడు-ధనుర్బాణధారియై. ]

దశ—ఇన్ని [illegible] అభ్యాసము చెప్పినను ఫలము లేదుగదా? అప్పుడే నాలుగు గజముల రెండు [illegible]

(లోపల "బుడబుడ" యనిధ్వని)

ఆహా! మఱియొకగజము జలముద్రావుచప్పుడువినఁబడియె. ఇదెవచ్చెను. (బాణము వేయును.

(లోపల "హా! నారాయణ! హా! నారాయణ!" అనుధ్వని)

అయ్యో! ఏమిది! హా నారాయణ యనునార్తరావమువినవచ్చె!

(పోయిచూడఁగా నక్కడ యజ్ఞదత్తుఁడను తాపసపుత్రుఁడు పడియుండును.)

యజ్ఞ—హా! నారాయణ! నారాయణ! వంచు ముసళ్ళ నాజననీజనకుల నింకెవ్వరరయునారు?

దశ—హా! శ్రీహరీ!—(మూర్ఛిల్లును)

బ్రా—ఎవరయ్యా యిక్కడ? మరణ వేదనమున కొట్టుకొనుచున్నాను. నాయెదనాటిన బాణమునుతొలఁగించువారు లేరా? మాజననీజనకులయొద్దకు నన్నెవరైనఁగొనిపోరే.

దశ—బ్రాహ్మణోత్తమా! అరయక నీప్రాణమున కెక్కువెట్టిన దుర్జాతుఁడ నేనే. వలసిన శాపమొసంగుము.

క॥ పాపాత్ముఁడనై యరయక
యీపాటోదవంగనిన్ను హింసించితినీ
శాపముపాలొనరింపు మ
హాపాయముగలుగఁగా ధరామరతనయా॥

బ్రా—హా శ్రీహరీ! శ్రీహరీ! ఈమరణాయాసమున కోర్వఁజాలను. పుణ్యాత్మా! ఈబాణము వెలికుము. ఇందేదాఁపుననున్న మావృద్ధాంధ జననీజనకులతో—

దశ—అయ్యో! నాయట్టికూ్రకర్ముఁ డుండునే.

బ్రా—అయ్యా! సహింపఁజాలను మాటలుండనిమ్ము. ఈబాణముదీయుము.

దశ—బ్రాహ్మణోత్తమా! ఇప్పుడేశాపమొసంగి నన్ను—

బ్రా—అయ్యా! నేఁబ్రాహ్మణుఁడగాను. శూద్రియందు వైశ్యునికి జన్మించినాఁడ. నీపుణ్యమగును. ఈయలుగుఁదీయుము.

దశ—తీసెదను. నీజననీజనకుల కేమి చెప్పెదవు?

బ్రా—ఏమిచెప్పఁగలను. అయిన నొకటిమాత్రము చెప్పవలసియున్నది. నియక్షమింప నేవేఁడికొంటినని వచింపుము. తీయుమూ యీనారాచము.

దశ—(దుఃఖించుచు బాణము వెలికను)

బ్రా—హాజననీ! హాజనకా! నారాయణ! నారాయణ! (అని చచ్చును)

దశ—-

## అనుబంధము 3

కట్టా! నేనెంతకూ్రరాత్ముఁడను. ఎంతదుశ్చరితుఁడను. ఈపాపమున కేది ప్రాయశ్చిత్తము.

అయ్యో! యీతాపసపుత్రుని జననీ జనకులితని నరయుచున్నారు. వారివలననైనను మృతిఁ బొందఁ శాపముఁగైకొందు. (నిష్క్రమి)



# పూర్వరంగము.

## తృతీయప్రకరణము-అదే నదీతీరమున నడవి.



కావడిలో వృద్ధాంధమైన తాపసమిథునమును ప్రక్కన దశరథుఁడును మూర్ఛిల్లియుందురు.

యజ్ఞదత్తు శవము నందేయుండును.

తా — హాపుత్రా! హాతనయా! ఇట్లు మమ్మొడఁబాసి పోదువనిమే మొక్కఁడు నేఁడు గముగదా? మా మూలదైవము నీవుమాకు లేకుండఁజేసెనే.

తా — (స్త్రీ) — తనూభవా! వృద్ధులము నంధులమునైన మమ్మీకావడిలో నుంచుకొని యాయాసమనక మోయుచువచ్చితివే. ఇంకమమ్మెవ్వరు రక్షించువారు?

తా — అయ్యో! మా కేలయీపాడు దాహముగలిగెను? ఊఁచినఁబోవనుండు మాప్రాణముల గొండ్డంటఁ గొట్టినట్టాయెఁగా?

తా — (స్త్రీ) — తనూజా! నెలదినములక్రిందట మాకిరువురకుఁ గలిగిన వ్యాధులవలననైనఁ జావమైతిమే. ఇది చూచుటకేకదా?

దశ — అనుబంధము 4.

మునివతంసమా! నాప్రాణములన్నియు మీకే యర్పించుచున్నాను. ఈపాపభారము సహింపఁజాల. ఇప్పుడే నాయంతమొనర్పుఁడీ? ప్రార్థించెద

తా — అయ్యో! మాప్రాప్తియిట్లున్నది. నీవేమిచేయఁగలవు? నీశబ్దవేదులు మాప్రాణవేధులుగా మాముద్దుతనయుని హృదయవేదనమొనర్చునపుడు వాఁడాడినకడమాట యింత వచింపుమా.

దశ — హా! దుఃఖము దుఃఖము తాపసవర్యా! నా క్రూరకృత్యమునకుఁదగిన దండనమొర్చితిరేని మీసుతుఁడాడినమాట వచించెద.

తా — ధరణీశా! మేమేమిశాస్త్రియొనర్తుము. అదైవమెయున్నాఁడు కరుణించిచెప్పుమా వాఁడేమనెను?

దశ — తాపసవర్యా! ననుదరిఁ జేర్చుటకు మీకు రెండెతెరవులు. శపించినిర్దహించుటయొకటి. లేదేని కరుణించి నాతుకర్షమీకొమరునిమారుగాఁ గైకొనుటయొకటి. ఈరెండవభంగియే మీకిష్టమైన రాజ్యమంతయుఁ సన్యసించి మీకొడుకునవలె మిమ్ము మనినంత కాలము మోసికొని తిరుగాడుచు నాపాపములోని లవమైన బాసికొనుటకై —



# పాదుకాపట్టాభిషేకము.

## ప్రథమాఙ్కము.

### ప్రథమరంగము-దశరథునాస్థానము.

[ప్ర: దశరథుఁడు-వసిష్ఠుఁడు-సుమంత్రుఁడు-సేవకుఁడు]

వసిష్ఠుఁడు—అట్లయిన నీయిష్టము. నీకేభయముగానున్న [illegible]ము.

దశ—భయమునకుఁగాదు, నాకేమో చేయవలసినట్లు మనసు తోఁచుచున్నది.

వసి—రామునితో మాటలాడియున్నావా?

దశ—ఎక్కడిది? నేఁడుదయముననేగదా నాకుఁదోఁచినది. నిన్నరాత్రివఱకు నాకే సంశయమే లేదే—సేవకా! రామునిఁ బిలిపింపుము. భ[illegible] లేకుండునది [illegible]ము చింతనీయము. ఈదుస్స్వప్నఫలము ఘోరముగ నిపుడుండెనే. కావున నాకేకేను రాక ముందే యీకార్యమొనర్పవలెనని బుద్ధిపొడముచున్నది.

[ప్రవేశము: రాముఁడు]

రామ—(నమస్కరించి కూర్చుండును).

దశ—రామచంద్రా! అఱువది సహస్రములనుండి పృథ్వీపాలన మొనర్చి యెనుబది యేండ్లుమీఱిన వృద్ధుఁడనైతిని. ఈచైత్రశు॥ 9 యే శుభదినముగా వసిష్ఠులు నిశ్చయించినారు నీపట్టాభిషేకమును నంగీకరింపవలయును.

రామ—జనకా! ఉన్నట్టుండి యిపుడేమి? ఇంక నేఁబ[illegible]యను రాజ్యమేలుటకు సమర్థుఁడవై నీవుండ నాకేటికీప్రయాసమిప్పటినుండి?

దశ—తనయా! నీకుఁబదియునెనిమిదవయేఁడు సమీపించె. ఈశుక్లనవమికిఁబదునే[illegible]డు నిండుఁగదా? చిన్నవయసున రాజ్యమేలఁగలిగినఁ బ్రజల సుఖదుఃఖములు చక్కఁగా నెఱుఁగవచ్చుఁగదా?

రామ—జనకా! నీమాట జవదాఁటువాఁడనా? అయినను క్షమింపుము. నేఁడు విదియ గదా? ఈమూఁడుదినములలోఁ బట్టాభిషేకము కావలసినంత త్వరయేమి? అదియును గాక భరతశత్రుఘ్నులును లేరె వారు లేక యీకార్యమును జరుపుటకు నాకుఁగుతూహలముండునా? ఈలగ్నము కాకున్న మఱియొక లగ్నమారయుము. నను మన్నించి వారలఁ బిలువఁబంపుము.

### అనుబంధము 5

తే॥గీ॥ చెలువుమీఱఁగఁ బట్టాభిషేకవేళ
నెవ్వరెవ్వరో పెఱవారలేగుదెంచు
వారుగా యట్టిచోఁ బూర్ణిఁ గౌరవించు
చిన్నితమ్ములు లేకుండఁ జేయనేల॥

వసి—రామా! నే నంతయుం జెప్పితిని. నిన్న రాత్రిఁ గలిగిన యొక కారణమున మీ జనకుఁడు నీకుఁ బట్టాభిషేకము చేయఁ గోరినాఁడు. దినముల నాలోచించి చూడ నీ పంచమి తప్ప మఱి దినము దొరకదు. కావున విధిలేక వచ్చినది.

దశ—పుత్రా! నే నెంతయు నాలోచించియే యున్నాను. భరతుఁడు లేక నిన్నభిషిక్తునిఁ జేయవలెనని నాకేమి కోరిక యున్నది? పది దినముల క్రిందట నీ బుద్ధి గలిగియుండిన భరతుని గిరివ్రజపురమునకు నే నేల పంపుచుంటిని. ఈశుద్ధనవమికి నీ పదియు నెనిమిదవ యేఁడు పడును. సంవత్సరమున నభిషేకము చేయరాదని యార్యులందురు. రాఁగల సంవత్సరమునఁ జైత్రమాసమున గురుమూఢము రాఁగలదఁట. తర్వాతఁ జాతుర్మాస్యలనొనర్ప రాదు. మఱల మాఘమాసమున శుక్రమూఢము రాఁగలదఁట. చైత్రమాసము వఱకు నదియుండునఁట. ఇంతలోననే యిరువదియవ సంవత్సరము రాఁగలదు. కావున నా వత్సరమంతయు సరిపడదు. ఇట్లే మూఁడేండ్లు కడచఁగలవు. కావున నిట్లు ప్రయత్నించితిని.

రామ—మూఁడేండ్లు కడచిన నేమి? పిదపనే కానిమ్మేమియవసరము.

దశ—పుత్రా! అట్లు కాదు. ఊరక మూర్ఖ్యము నూనియున్నవాఁడనా? శీఘ్రముగ నే నీకుఁ బట్టముగట్టవలసిన కారణములు నిన్న రాత్రిఁ గలిగినవి. అవియన్నియు నీకెఱిఁగింతు లెమ్ము. అయిన నా వృత్తాంతము నీవు మీ తల్లులతోఁ జెప్పకుము. భీతిల్లుదురు. కావున విధిలేకున్నది. ఇది నీవొనర్పకున్న నాకుత్సాహభంగము గాఁగలదు.

### అనుబంధము 6

క॥ ఎన్నాళ్ళకు మున్నో నీ
కెన్నిలఁ బట్టంబుఁ గట్టవిల్లే కడచెన్
మిన్నక కాలం బీఁకనో
యన్నా సలువంగఁ గూడ దాలస్యంబున్ ॥

క॥ ఊరక యోచింపకుము కు
మారక యీ కార్యమైన మఱిచేసూటిన్
గోరిక లెల్లను దీఱుఁగ
భారము నా వాంఛితంబు పాటిల్లఁగదే॥

రామ—నీయాజ్ఞకు వ్యతిరేకముగలదా? నీయిచ్ఛ తెలుంగునవే కానిమ్ము.

దశ—మంత్రీ! సుమంత్రా! రేపు బుధవారముననే పట్టాభిషేకము కావలసియున్నది. నేఁడప్పుడే భానువారమాయెను సర్వసన్నాహములు నీవెట్లుచేయఁగలవో. పుత్రా! ఏల యాలోచన?

రామ—భరత శత్రుఘ్నులు లేరుగా యనియే.

దశ—ఏమిచేయవచ్చును? అక్కడికిఁ బోవనే మూఁడునాళ్లకుఁ దక్కువకాకుండఁ బట్టును. యత్నము లేదు. పోదము రమ్ము. (నిష్క్రాన్తి)



## ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.



### కైకేయియిల్లు.

[ ప్రవేశము: మంథర ].

మంథర—ఆహా! పురమంతయు నలంకరింపఁబడుచున్నది. ఎవ్వరు చూచినను నగుమొగము లలరార స్వర్గమేలఁగలిగినట్లు సంతోషభరితులైయున్నారు. రామునికిఁ బట్టాభిషేకమఁట! రామునికఁట! పట్టాభిషేకమఁట! రామునికిఁ బట్టాభిషేకమైన నీజను లందఱకేమి? తమకే యభిషేక మగునట్లుత్సాహముఁ జెందియున్నారు! ఈదుఃఖము నేఁజూచి యోర్వఁగలనా? నేనిందుఁ గైకేయి వెంటవచ్చినది మొదలు దుఃఖమునకే కారణమైయున్నది. నేనెవరికేమపకారముఁ జేయకున్నను, పురజనులందఱు నను దిరస్కరించెదరు. ఒక్కరైన నా చెలిమిఁగోరరు. ఒరుల చెలిమికోరి నేఁబోయినను ననుఁజేరనీయరు. నేఁబోయితినా మాటలాడుచున్నవారందఱు మాటలుడిగి నేవెడలి వచ్చువఱకు మౌనముద్రవహించెదరు. ఒక్కరిమాట లితరులకుఁ దెలిసెనా, మంథరయే చెప్పెనని మొత్తికొందురు. ఇండ్లలోరహస్యము లేమయిన మాటలాడవలసి

వచ్చిన దొంతెత వెలుపలికి వచ్చి నేనేమైన నున్నానాయని చూచి పిదప మంతనములాడెదరు. నేను [illegible] జగడమునకుఁ బోయినను, వాకిండ్లు వేసికొందురుగాక, తిట్టుటకైనను [illegible] డరు. అందఱు నన్ను నికృష్టపుఁ జూపు చూచెదరు. కైకయొక్కతె [illegible]న్న మిగుల ననునది దానికిని నీనడుమఁ దెగులుగలిగియున్నది. ఎవరేమి చెప్పిరో [illegible] మగనితో నున్నప్పుడు తప్ప మిగిలిన యన్ని వేళల దానినేమఱకున్నానే [illegible] చెప్ప[illegible]లరు? ఆమగనితో నున్నప్పుడును, నేమఱకుండుటకై వారి గదికి వారికి [illegible] డ గండి పెట్టి వారిమాటలన్నియు వినుచున్నానే. కావున దశరథుఁడైనను నాపై [illegible]యుండుననుటకవకాశమే లేదు. ఏమో యేమియుఁ దెలియకున్నది. నన్ను గన్న [illegible] యెవ్వతె చెప్పియుండును? నన్ను [illegible]మించినవారు నున్నారుగా యీ [illegible]? ఆహా! తెలిసెను నన్ను రాముఁడు పుట్టచెండుతోఁ గాలువిఱుగ వేసియున్న నాఁడు కాలునొప్పివలన నేఁబండుకొనియుండిన కాలమునఁ గౌసల్య యీకైకతో మంతనములాడియుండెను. దానియింటికిది పోయియుండెను. అయిన నదిజరిగి నాలుగేనేండ్లాయెనే. కైకకీదుర్బుద్ధిపుట్టి నాలుగైదు నెలలాయెను. ఇట్టిపీడచోట నాకేమియు పని పోదమని యెంచియుండియు, నను దిరస్కరించు నీపురి నారికొక గుణమైనఁ జేయకపోవచ్చునా యని వేచియుంటిని. ఇప్పుడు సమయమబ్బెను. రామునికిఁ బట్టాభిషేకము! అరణ్యపట్టాభిషేకము చేయించెదను దానికై యెగురులాడుచున్న యీపురివారి కశ్రుజలాభిషేకముఁ గావించెదను అప్పుడయోధ్యవారందఱు మంథర ప్రభావముఁ దెలియనీ—ఈ కైక [illegible]కేమి రిమ్మయో యిదియు నెగురులాడుచున్నది. ఇదె వచ్చెను,

[ ప్రవేశము: కైకేయి ].

కైక—మంథరా! ఇక్కడ నేమి చేయుచున్నావు?

మంథ—నీవేమింత సంభ్రమముగాఁ బోవుచున్నావు?

కైక—రామచంద్రుని పట్టాభిషేకమని నీవు వినలేదేమే?

మంథ—ఆహా?

కైక—అదియే మిక్కడనున్నావు నీవు?

మంథ—బండికొఱకుఁ బంపియున్నాను. నిరీక్షించుచున్నాను.

కైక—బండి యేమిటికి?

మంథ—ఊరికిఁ బోవుటకు.

కైక—ఏయూరికి?

మంథ—గిరివ్రజపురమునకు.

కైక—ఎవరియొద్దకు?

మంథ—మీతండ్రి కేకయరాజునొద్దకు.

కైక—ఏలపోయెదవు?

మంథ—మనసు పుట్టినది గనుక పోయెదను.

కైక—అందుఁబోవ మనసేల పుట్టెను?

మంథ—ఇందుండ నిష్టము లేనందునఁ బోవ మనసుపుట్టెను.

కైక—ఇట్టిమాటలేటికే? ఇన్నాళ్లుండిన యిష్టము నేఁడేల లేకపోయెను?

మంథ—నేను, కౌసల్యదాసికి దాసిగానుండఁజాలను.

కైక—కౌసల్యదాసియెవరు?

మంథ—నీవు.

కైక—నేను కౌసల్యదాసి నెట్లగుదును?

మంథ—రామునికిఁ బట్టాభిషేకమైన నీవు కౌసల్యదాసిగాకింక కెవ్వరు?

కైక—మంథరా! ఇట్టిమాటలాడకుము. ఆరామునిపై నీవు పగసాధించెదవా? చిఱుతఁదనమునఁ గందుకముతో నిన్ను గొట్టినమాత్రముననే యిట్టిపగవలయునా? ఆరాముఁడెవ్వరనుకొన్నావు? నాకూర్మిసుతుఁడు. వానికిఁ బట్టాభిషేకమయిన నాకుఁ బరమ భాగ్యముగదా?

మంథ—(ఏడ్చుచు) కైక! నీకేమిబుద్ధిపుట్టెనే? ఎవ రెట్టిమందుపెట్టినారే నీకు? నీసవతికనుఁ బ్రాపువిగించుచున్నది నీ వెఱుఁగకున్నావు. కాళ్లక్రిందఁ ద్రవ్వి గుంట చేయునది కనలేవు. మిత్రుల నమిత్రుల నరయలేవు. వినాశకాల మాసన్నమైయుండ నీవెవ్వరిమాట లేలవిందువు! నాకేమయినదని నీయిచ్చవొప్పనఁ జెడిపోవనిత్తుఁగాని మీతండ్రి నిన్నత్తగారింటికిఁ బంపునపుడు నిన్ను నాకిల్లడ వెట్టినాఁడే నేనెట్లూరకుందును? రామునపై నాకుఁ బగయంటివే. ఇన్ని దినములయినదే యొక్కనాఁడైన వానిప్రస్తావము నీయెదుటఁ దీసియున్నానా? నాకన్నుల నీవుచెడిపోవుట చూడఁజాల. కావునఁ బోయెద.

కైక—మంథరా! నీవేమన్నను నాకా కౌసల్యసుతునిపైఁ గూర్మిమానదు. అయ్యో! రాముడా నీవిట్లనవలయు?

## అనుబంధము 7.

మంథ—కూర్మి యేలమానునమ్మా? ఆకౌసల్య నీకుసవతి కాదు. తోడఁబుట్టువు. అయ్యో! ఆకౌసల్యపై నింతపడి మొత్తికొందువే అదినిన్నుఁ గాలిగోరంతైనను సరకుచేయునా? నామాటలిప్పుడు నీవేలవిందువు! రేపుఁ బ్రొద్దున రాముఁడుచక్రవర్తియైన, భరతుఁడు

వక్రమూర్తియై, వానిచరణములు శిరసావహించి యూడిగము సేయునప్పుడైన నన్నుఁదలఁపవా? జనులందఱు నిన్నుఁ జూచి "ఈ కైక తనకు సరియెవ్వరనియుఁ గౌసల్యాదులకంటెఁ దనపైఁ బతికెక్కువ కూర్మియనియుఁ గర్వించుచుండెఁగా? ఇప్పుడుగదా యిదియొక భోగినియనుట స్పష్టమాయెను" అని వచించుచు ముసిముసి నవ్వునప్పుడైన నను దలఁచవా? కౌసల్య చక్రవర్తిమాతయై "కైకా! యిటువచ్చి కాళ్లొత్తు"మని నిన్ను బిలువ "కౌసల్యాదేవీ! భాగ్యము" అని నీవు దాసితనము చేయువలసివచ్చినపుడైన నన్నుఁదలఁపవా? ఏమిసార్థకము! యెంతెక్కువగు కొలఁది బుద్ధి తక్కువగునందురుగదా!

కైక—మంధరా! ఏలయీమాటలు?

చం॥ జగదభిరాము రాము నినసంతతిసాగరపూర్ణసోముని
దెగడెద వేటికిట్లు విన నేరఁగదా యిటువంటిమాటల
మగువరో యేలయింతపగమానుము నాకు హితంబుకూర్తు వే
నిగరువమార రామునకె నెయ్యము మీఱుశుభంబుఁగోరుమా.

రాముఁడు భరతునికంటె నాయెడ నెక్కువభక్తిగలవాఁడు. కౌసల్యతోడఁబుట్టువునకంటె నెక్కువగా ననుఁజూచును. వీరట్టివారైనను నాపతియుండ లేవా? వారికి బుద్ధిగలవఁడా?

మంథ—నృపతి—వనీపతి—అతని చరిత్రము తెలిసియుండిన నిట్లనుచుంటివా? చెప్పిన నేనె యెరవులదాననగుదు.

కైక—ఏమిచరిత్రమే? దాఁపక నాకుఁ జెప్పుము.

మంథ—అది యుండనిమ్ము. నృపతి నీయందిచ్చగలవాఁడే కానిమ్ము. రాముఁడు రాజ్యమేలు కాలమంతయు నతఁడు వెడలఁబ్రదుకు ననుకొన్నావా? శతవృద్ధుఁడై కాటికిఁగాలుసాఁచియున్నవాఁడెన్నిదినములు జీవించియుండఁగలఁడే?

కైక—(హరి! హరి! అని చెవులుమూసికొని)

అనుబంధము 8

కం॥ ఆహాహా యిది యెంతటి
సాహసవాక్యంబె యింతసంతాపమునిం
తే హరిహరి యెటులోర్తు దు
రాహతి యిటులాడ మంధరా! నీకగునే॥

మంథరా! ఎట్టి కర్ణకటకములగు భాషణములాడెదవే.

మంథ—అమ్మా! క్షమింపుము. తప్పాడితి. నీపతి స్థిరజీవి. బ్రహ్మచచ్చినను, నతఁడు చావఁడు ఉన్న మాటయున్నట్టన్నుండూరచ్చిరాదందురుగా? నీపతి కలకాలమును మని యుండినను, నతనిమాటేమైన జరుగఁగలదా? సార్వభౌముఁడైన రాజు వేఱె యుండినను, నతఁడేమైన ననిన నతఁడును నీతోఁగూడనిల్లువెడలవలసినవాఁడెగదా! కైకా! నీకేమిమురులే. నీకేమజ్ఞానమే. నీపతిచరితము చూచిచూచి యిట్లుమోసపోయెదవు.

కైక—ఏమే నాపతిచరితము? నాకొక్కటియుఁ దెలియదు.

మంథ—తెలిసియుఁ గన్నులు తెఱవకున్నావు. నీపతికి నీపై మోహముగలదని యెంచి యున్నావా? చెప్పుము.

కైక—నాకేమియు సందేహముతోఁపదు.

మంథ—కైపు తలకెక్కినప్పుడేలతోఁచును. పోనీ, నీకొడుకుపైన నతనికిఁ గూర్మి కలదా?

కైక—అదియేమే? అతనికి రాముఁడు వేఱె భరతుఁడు వేఱెయా?

మంథ—కైకా! లోకమున నందఱు నిన్ను పాయశాలినియందురు. ఇందులకా? భరతుఁడు మీయయ్యగారి యూరికిఁబోయి యెన్ని దినములైనది?

కైక—పది దినములైనది. ఇప్పుడేల?

మంథ—ఇప్పుడుగదా పట్టాభిషేకము? వాఁడు లేకుండ వానివేఱూరికిఁబంపి యిప్పుడు పట్టముగట్టనెంచినాఁడే చాలదా?

కైక—మనము వినలేదా శుభదినము లింకఁగలుగవని దశరథుఁడు త్వరలో నీకార్యము తలపెట్టెనని?

మంథ—నీకెట్టి విశ్వాసగుణమే? మూఁడుసంవత్సరములనుండి మీతండ్రికోరుచున్నాఁడే యిప్పుడా భరతుఁ బంపవలయు?

కైక—భరతునిఁబంపునపుడీప్రశంసయే లేదుగదా?

మంథ—కోడిపాలు పితికి తెచ్చివామన్నఁ జేఱపెట్టుమను దానవుకదా నీవు? ఈపట్టాభిషేక ప్రశంస యెన్నఁడును లేక యిప్పుడే టక్కునఁబుట్టెఁగా? ఇప్పటికిసంవత్సరము క్రిందటనే రామాదులవివాహములు చేసికొనివచ్చినపుడే రామునికిఁ బట్టాభిషేకమింతలోనే చేయవలయునని నీపతియన్నట్లు నీవే చెప్పితివే. మఱచితివా!

కైక—ఆపుము మాటకలిగెను. తర్వాత మఱచియుండరాదా?

మంథ—ఈయుక్తి దశరథునికైనఁదోఁచియుండదు. పోనీ! భరతుఁడు లేకయీ కార్యము చేయనున్నాఁడే నిన్నొక్కమాటయైన నడిగినాఁడా!

కైక—నాయొద్ద కింకనురాలేదు వచ్చినపుడు చెప్పునేమో

మంథ—"చెప్పనేమో"! భరతుఁడు లేక యీపని చేయనున్నందులకు నిన్నూ తొప్పుట పోయెను నిను వేఁడుకొని నీయనుజ్ఞవడయుటపోయెను. నీవాడంబడకయున్న నీకాళ్ల పైఁబడుటపోయెను "చెప్పనేమో" కదా? భానువారము నాఁడుగదా యీప్రశంస గలిగె. ఆరాత్రి నీనాథుఁడెందుండెను.

కైక—కౌసల్య యింటనుండెను.

మంథ—ఇక్కడివచ్చి నోటిమాటైన నీతోఁ జెప్పఁడాయెఁ గా.

కైక—మొన్న కౌసల్యవంతుగదా?

మంథ—వంతు! వంతెన్నఁడు దప్పఁడో నీమగఁడు?

కైక—విధిలేని సందర్భము గలుగకున్నఁ దప్పఁడు.

మంథ—భరతునిఁ బంపి నాల్గుదినములైనను గాకముందె రాముని ముందమోయింపనెంచి నాఁడే. ఈమాట నీతోఁ జెప్పవలయుట "విధిలేనిసందర్భము" కాదుగా? నీవింకను "ప్రీతి" యనెదవు!

కైక—ఏల యిట్టి నిష్ఠురము లాడెదవే? నే వినఁజాలను.

మంథ—పోనీ! నిన్న సుమిత్రవంతుగదా? ఎందుండెను?

కైక—సుమిత్రయింటనే—కాదు నిన్నను కౌసల్యయింటనే యుండెనని వింటిని.

మంథ—ఇక్కడ వంతుదప్పునట్టి విధిలేనిసందర్భమేమమ్మా?

కైక—(యోచించుచు నూరకుండును)

మంథ—(స్వ) ఇప్పుడు కొంచెము మార్గమునకు వచ్చునట్లున్నది. (ప్ర) నీవూరకున్న నేఁ జెప్పెదను వినుము. ఆకౌసల్య కుమారునిపైఁ గూర్మివలన నేకదా నిన్న నచ్చటనుండుట? ఇంకను బట్టాభిషేకమయినఁగాలేదే. అప్పుడే వంతుదప్పునంత కూర్మిగలిగిన ముందెట్లుండును?

కైక—హా! శ్రీహరీ! మంథరా యిప్పుడు స్మరణకు వచ్చుచున్నది.

మంథ—నీస్మరణపై మన్ను పోసిరి. మేలుకోరి బుద్ధిచెప్పవచ్చిన నాకు (ఏడ్చుచు) రాముపైఁ బగగట్టితివి. దానిసగాఁ జేయనున్న కౌసల్య యుత్తమోత్తమయంటివి. ఆవంతైన నిను సరకుసేయని పతినామునికి మోసుకపోవునంత ప్రీతియంటివి. నేనీ యింటనుండను. పోయెదను. (లేచును)

కైక—మంథరా! నను క్షమింపుము. కరుణింపుము. నీకంటె నాకాప్తులెవరు? నిలువుము. (పట్టుకొని నిల్పును).

మంథ—నీకు హితులహితులగు కాలమువచ్చియున్నది. మాతల్లి గొఱ్ఱెలన్న నట్లనాయని విశ్వాసము బుద్ధి గలిగియున్నది. నీయింట నేనుండనయుండను. (వసరును).

కైక—(మంథర చరణములు పట్టుకొని).

## అనుబంధము 9

మంజభాషిణి। ఉరియాడునాడుమది యూఁటడిల్లునా
వెరవింత చూపికడు ప్రేమనింపవే
యిరవారనాకునిఁక నెవ్వరేసఖుల్
నిరసింపనోనె కరుణింపుమంథరా॥

మంథరా! ఇట్టి సమయమున ననుఁ జేవిడువవచ్చునా? నమస్కరించి వేఁడికొందును. పోకుము.

మంథ—(కూర్చుండి) ఇంకేమి చేసెదవు? మించిపోయె. నిర్వాణదీపమునకుఁ దైలము పోసిన నేమి ప్రయోజనము?

కైక—మంథరా! నీవు దప్ప నన్ను సంరక్షించువారు లేరు. ఇంకేమైన యోచనయున్నఁ జెప్పుమా.

మంథ—వెన్న చేతఁ బెట్టుకొని నేతికి వెదకెదవే? అంతయు నీస్వాధీనముననే యున్నది.

కైక—నాస్వాధీనమున నేమున్నదే?

మంథ—భ్రాంతా! దేవాసురుల యుద్ధమునాఁడు నీమాయోపహార విద్యకు మెచ్చి నీకు రెండు వరముల నీపతి యీఁడా?

కైక—ఆహా! మఱచియుంటినే. భరతు పట్టాభిషిక్తుఁ జేయుట కిప్పుడే యొకవరమడిగెదను.

మంథ—మిగిలినయొకటి నేమిచేసెదవు?

కైక—ఇంకెప్పుడైన నుపయోగమగుఁగదా?

మంథ—బుద్ధిశాలినీ! ఆవరము దొరకుటకంటె నూరకుండుము. బ్రదుకఁగోరిన రెండు నిప్పుడే యడుగుము.

కైక—మఱియొకవరము నేమని యడుగుదును?

మంథ—కైకా! నేను దీర్ఘ యోచన చేయక మాటాడననుట నీవియ్యకొందువుగదా? మాటలు కఠినములైనను సుపాయమును మనసును మంచివని నీవొప్పుకొందువుగదా? నేనేమయినఁ జెప్పిన నీకుఁ గోపము రాదుగదా?

కైక—మాతల్లిమాఱుగా నీవున్నావు. నీవేమన్నను బరమార్థము భావింతుఁగాక కోపముగలుగునా?

మంథ—ఆరెండవ వరమునకు శ్రీ.పే రామునిఁ బదునాల్గేండ్లరణ్యమునఁ దపసి వృత్తి నుండఁ బంపఁగోరుము.

కైక — హా! శ్రీహరి! (చెవులుమూసికొని) మంథరా! ఎంతమాటాడితివే! ఎట్టిపాపము వినిపించితివే! భరతునకుఁ బట్టముగట్టు నడిగిన నడుగవచ్చుఁగాక రాము నరణ్యమునకుఁ బంపనెట్లు వేఁడుదును? నానోరెట్లాడును? రాముఁడే! భక్తికరుణాధాముఁడే! ఇనవంశాబ్ధిసోముఁడే! రూపజితకాముఁడే ఆతఁడా యరణ్యములనుండవలయు? నాచేతఁగాదు. వలయునన్న భరతుఁడే యరణ్యమునను౦డనీ. వాఁడు రామదాసుఁడే కానీ. నేను కౌసల్యదాసినైన నగుదుఁగాని, యట్టిదుశ్చరితమునకు నేనియ్యకొందునా.

కం॥ అయ్యోద రాజ్యబహిష్కృత
నయ్యెదఁ గౌసల్యదాసినైన నకట! నా
నెయ్యంపు సుతునిఁ గానల
కయ్యో! పనుపంగ నెట్టులడుగుదు నబలా?

మంథ — రాముఁడే — కైకేయీమనోబ్జసోముఁడే. రాజ్యసర్వస్వకాముఁడే కుత్సితగుణధాముఁడే - నన్నేలనిల్పితివి? రాముఁడు కానలకుఁబోవకుండిన భరతునకుఁ బట్టాభిషేక మెట్లగునని యింత తెలియఁజాలవే.

కైక — మంథరా! అదియేల కాదు?

మంథ — ఇట్లగుచుము. యుక్తియున్నఁదైకొనుము. మార్గము మాత్రము మూనుము. నీకు వరమిచ్చినఁ బట్టాభిషేకమునకు భరతునిఁ బిలిపింతురుగదా? అప్పుడు రాముఁడుండిన నీయూరియుండలు దశరథుఁడు కౌసల్యయు నూరకుందురా? భరతునివేఁడికొని రైన రామునికిఁ బట్టముగట్టింతురు. అప్పుడు నీవు వరమడిగి చెడుగుమాత్రముగట్టికొందువు.

కైక — నీమాటల నెంత యుక్తియున్నను, క్రూరకర్మముగదా? తపసివేషమున నేల యుండఁగోరవలయు? పదునాల్గేండ్లేల కోరవలయు?

మంథ — ఊరక యవివేకమునఁగాని, క్రోధమునఁగాని, యీవరముఁ జెప్పితినని యెంచకుము. రాముఁడరణ్యమునకుఁ బోయినచో భరతునిలోఁజేసికొని దశరథుఁడు వాని బిలిపించి పట్టమొసంగకుండును. అట్లొకవేళ రాముఁడు వచ్చినను తపసివేషముండకుండిన రాజ్యమేలు నేమోయను భీతిచేతను, నీవరమునుగఁ జెప్పితిని.

కైక — నీమాటలు నాకుఁదెలియవు. పదునాల్గేండ్లయినపిదప రాముని బిలిపించి రాజ్యమీఁగూడదో దశరథుఁడు?

మంథ—కైకా! లోకవృత్తమింతైన నీకుఁ దెలియదా? మీదశరథుఁడెన్ని దినములు బ్రతుకఁగలఁడని యెంచియున్నావు? పదియేండ్లుండును. ఇంకను నెక్కువైనఁ బండ్రెండేండ్లును. నేనింకను రెండేండ్లెక్కువగా నుండియున్నానే.

కైక—మంథరా!—

మంథ—తాళుము. ఒకవేళ నింకను నెక్కువనాళ్లు బ్రతికినను, బదునాల్గేండ్లు రాజ్యమేలినవానిదప్పించుటసుకరము గాదు. అదిగో! పల్లకిమోయువారలధ్వని వినుపించుచున్నది. నీమగఁడు వచ్చుచున్నాఁడు. ఇంకఁ దడయకుము. ధైర్యము వదలకుము. రామునిఁబంపువరకే తొల్తనకుగుము. సమీపముననే వచ్చెను. పొమ్ము కోపము పైవేసికొనుము. పొమ్ము పొమ్ము.

కైక— (నిష్క్రమించును)

మంథ—ఇంతమట్టుకు మార్గమునకుఁ దెచ్చియున్నాను. ఇంకఁ దిరుగఁజాలదు. అగ్నిపెట్టితిని. పొగరాఁజుచున్నది. దానిమంటఁజూచుభాగ్యము నాకుఁగలుగునా! ఇంక రాముఁడు పట్టాభిషేకము చేసికొనుఁగాక! దశరథుఁడును గౌసల్యయుఁ గన్నులం జల్లఁగఁ జూచెదరుగాక! ఊరిముండలందఱు నెగురులాడుచుఁ బోయెదరుగాక!

[ప్రవేశము: దశరథుఁడు.]

దశ—మంథరా! కైకయెందున్నది? ఇల్లంతయు వెదకితిని.

మంథ—(నిట్టూర్పు విడుచును)

దశ—అదియేల యీనిట్టూర్పు. కైకకేమైన నాపదగలిగెనా?

మంథ—అదియేమియు లేదు? మీకైక యాకోపగృహమున నొక్కరితోడను మాటలాడక పండుకొనియున్నది.

దశ—అది ఏమి-ఏమి-నేఁబోయి విచారింతును. మంథరా! నీవిందే యుండుము. (పోవును)

మంథ—(తలఁద్రిప్పి) ఉండెదను లెమ్ము—

[వెనుక యవనిక నెత్తినఁగైకేయి, గానిల్లి పండుకొనియుండును].

దశ—(కైకయొద్దకువచ్చి) తరుణీ! ఈవిధియేమి? నీవిట్లుండుటకుఁ గారణమేమి? రాకాసుధాకర బింబముఁబోలు నీముద్దుమోమేటికి నేఁడు వాఁడియున్నది? తెలివి కలిమిఁజేపట్టినవాని ధన్యుఁ జేయు నీకన్దామరలేటి కశ్రుజలముల నిండియున్నవి? నేవచ్చిన వెంటనె ముదమారఁ జిలుకల కులుకు పలుకుల "నాథా! ప్రాణేశా" యని పిలిచి నానావీనులకు నానందము నించు నీమోముదమ్మి నేఁడేల మానము ద్రవహించియున్నది? ఏతెంచిన వెంటనే మానక యెల్లవేళల నన్నాశ్లేషించుచుండిన నీకేలు

దోయి నేఁడేల యొకటినొకటి పీడించుచున్నవి? విలువగల జిలుగువలిపట్టుపలువలు మాని యీప్రాఁతచీర నేఁడేలవచ్చె? ఒక్కొక్కటి యొక్కొక్కజగమునైన వెలఁ గొనఁగల బలుసొమ్ములు నేఁడేలమైఁబూనవు? అది యెవరపరాధమొనర్చె? కాంతామణి! ఎవ్వరివలన నీకీపరిభవముగలిగెను? ఎవ్వరు నీకుది నొవ్వఁజేసిరి? ఉద్దిలేని ముద్దుచిలుకవోలె సమ్మదమ్ముగ్రమ్మ నెమ్మివోలె సంచునించు వంచవోలె నిన్ను నే జూచికొందుఁగా? అట్టి నీకపరాధమొనర్చినవాఁడెవఁడు? తనప్రాణముల నించుకైన సరకుసేయని యాక్రూరాత్ముఁడెవఁడు? కామినీ! నీయాజ్ఞయించుక కలిగిన దరిద్రునైన నింద్రుఁజేయఁజాలుదు. ఇంద్రునైన దరిద్రుఁజేయఁజాలుదుఁగదా? ఒక్కమాటాడుమా. నీవగపునకుఁగారణమేమి? తరుణీ! పలుకవు?

## అనుబంధము 10

కైకా! నయనప్రభాకాంతరిత సారంగపాకా! శిరోజాతసముంచితవిభా నిరాకృత చంచరీకా! పయోధరయుగళనిరస్తకోకా! సుందరీసిజప్రతీకా! సమంచితబిబ్బోకా! బహుసుశ్లోకా! మహిమాస్తోకా! నిరంతరనవరాకా! విగతశోకా! మత్ఫల పరిపాకా! కృపాలోకా! కైకా! నీకేటికీ కాక? నాపైఁగోపమా లేక యేటికి సౌమ్యభావమున ననుఁజూచి యాజ్ఞాపింపవు–లెమ్ము.

కైక—(లేచి యేడ్చును) నాథా! యెంతయుండియు నేననాదనేయనుగతి గలిగె. కష్టుఁజూలకనైతి. నాయభీష్టము నెఱవేర్చువారు లేరైరి.

దశ—మనోహారిణీ! నీయభీష్టమైన నేమి? సర్వాభీష్టములు సమకూర్ప నేనుండ నీకేటికీ కొఱఁత?

కైక—నీవనుటకేమి? నీవాడినంత జరుపుదువా యను సంశయమును నాకుఁగలిగెను.

దశ—అయ్యో! ఇట్లేల నన్నలఁతిఁగాఁజూచెదు. పొలఁతీ! నిన్నున్న లవలఁతియుంచుఁ గన్నులఁగప్పికొందునే. నీమాట జవదాఁటుదునే! నీకేటికీ సంశయము? నీయభీష్ట మెట్టిదైనను, నెట్టి యసాధ్యమయినను, నాకుశక్యముమాత్రమాయెనా నెఱవేర్తును. నీయాన, నాయాన, రామునాన, నెఱవేర్తును–ఆనతిమ్ము.

కైక—అట్లయిన రామునిమాని మా భరతునికిఁ బట్టముగట్టుము.

మంథ—(స్వ) పాసుముండ యిట్లేలడిగెను?

దశ—ఏమీ! ఏమీ! కైకా! నిక్కమాడితివా? నేనేమైనఁ దప్పువింటినా? నామనసు పరీక్షించెదవా?

కైక—త్రికరణశుద్ధిగా నిక్కమాడితిని.

దశ—హా! దైవమా! కైకా! నీకేటికీ కోరిక? రాముఁడు నీకెట్లుపగతుఁడు? వాఁడు

పట్టమున కేటికర్హుఁడు కాఁడు? భరతునికంటె వాఁడు నీకెట్లు ప్రియుఁడు? ఇట్టిమాట నాడకుము. నీమాటలు నీకే కర్ణశూలములుగా నుండఁగా నాకెట్లుండఁజాలవు?

కైక—ఎట్టి యసాధ్య కార్యమైన శక్యముమాత్రమాయేనా చేసెదనంటివే. వచన మిచ్చి లేదనుము. నాకంతయచాలును.

దశ—ఏలయిట్టి విషమపరీక్ష? ఇది నాకుశక్యమా? నేనెట్లు వచనమును ద్రిప్పినవాఁడను?

కైక—చేతనున్నది. ఒక్కమాటాడిన జరుగునది. ఇది శక్యము కాకున్న నింకేదిశక్యము? అయ్యో! ననంత మోసపోయితిని. నాపతి నన్నుఁ బ్రాణపదముగాఁ జూచునని యెంచియుంటి. నాకీయఁదగనిపదార్థ మతనికొక్కటియు లేదని నమ్మియుంటినే! ఊరివారందఱు వనుజాలుకనగాఁజూచినను నాపతియట్లొనర్పఁడని నచ్చియుంటినే! ఆనమ్మకము, ఆనచ్చికోలు, వమ్మాయె—వితయాయె.

## అనుబంధము 11.

మంథ—(స్వ) భళి-భళి.

కైక—రాజేంద్రా! నేనింకేల మనవలయు? ఇంక యెవరినమ్మవలయు? నమ్మి యెవరి నుద్ధరింపవలయు? ఏదైనను బావియో చెఱువో చూచికొందును. నీవును నీకౌసల్యయు నీరాముఁడును నిశ్శంకముగానుండుఁడు. (పోవఁబోవ).

దశ—(నిలిపి కౌఁగిలించి) కైకా! ఇన్నిదినములనుండి నన్నరయుచుంటివే. ఇవ్వాళ్ల నుండి లేనిబుద్ధి నేఁడేలగలిగె! నినునమ్మినవాఁడనే. ఎన్నఁడైనఁ జులుకనగాఁ జూచునా? నీవే బాసచేయుమన్నను. చేయుదును. ఇదిగో! ఈముద్దు—

కైక—రాజేంద్రా! ఈవిన్నాణములు చూపకుము. ఈముద్దులుచాలును. మోహముల మోసపఱచుట నీకసాధ్యము. నాయభీష్టము నెఱవేర్చిన వేయిముద్దులు నాకెక్కును.

దశ—కైకా! నీవు సద్గుణముల ప్రోవుగదా? ఈక్రూరగుణముమాని నన్నాదరింపరాదా?

కైక—ధరణీశా! ఇక్ష్వాకుకులజు లాడితప్పనివారని పేరొందిరి. ఆవంశమున ననసదృశ కీర్తిమైమంటివి సత్యసంధుఁడవని ప్రసిద్ధిఁగంటివి. కోరిన కోరిక జరుపుదునంటివి. నాకోరికవింటివి.

దశ—సౌహార్దమున సమరసభావము పాటించిన నీబుద్ధి ముదరఁద్రొచ్చెఁగా? మోహంపుటన్ను వోటనొందనరామి నూరకుంటిని. నాకుఁగోపమువచ్చును. ఊరక బుద్ధి కలిగియుండుము.

కైక—(ఏడ్చుచు) అయ్యో! మాటతప్పియు నన్నే తెగడనాడుట కలిగెఁగా? ఆహా! నాదురదృష్టము! రాజేంద్రా! ఇదేపోయెద. కూపమునంబడియెద. దీనికైన నాజ్ఞయిమ్ము.

దశ—కూపమునఁగాకున్న నీప్రాప్తియున్నదానఁ బడుపొమ్ము. నాయాజ్ఞయేల? నీవాకరియాజ్ఞలో నుండినఁగదా?

కైక—భూమ్యాకాశదైవములారా! (ఏడ్చుచు) మీరేసాక్షులు. ఇట్టియసత్యవాదికాలనైమని యుండఁజాలక యసువులఁబాయఁబోయెద.

దశ—అనృతోదరీ! నీచెడుఁగునకు దైవముల నేల సాక్షులఁగోరెదవు? నేసత్యసంధుఁడగుటయుఁ గాకుండుటయు లోకమెఱుఁగదో? నీప్రాప్తికొలఁదిఁ బోవుచున్నా ననుము.

కైక— (నిష్క్రమించును)

దశ—అకటా! ఈయబల యింతటిరాక్షసియగునే.

శా॥ అహోహో యెఱుఁగంగనైతిఁగదె యీయంభోజపత్రాక్షి సం
దేహంబేటికిఁ గాళరాత్రియగు సాధ్వీరత్నమౌనంచుఁ గా
లాహింబెంచితి మోసపోయితి నపాయంబయ్యె నీతన్వికిన్
ద్రోహోద్యోగము గల్గనేమిటికి నాదుష్ప్రాప్తికేమందునో॥

మంథ—(స్వ) (చేతులుగొట్టి) అయ్యో! ఎంత తెలివిలేనిముండ! వరములేల యడుగ రాదు?

[పునః ప్రవేశము: కైకేయి.]

కైక—అచలాధీశా! నేఁబోయితినని సంతోషపడితివి కాఁబోలు. పీడపీడెననుకొంటివి కాఁబోలు. నేనేలపోయెదను నీమాట నీకొప్పగింపక? అల దేవాసురులయుద్ధమున నాకు రెండువరముల నిచ్చితివే. అవియైన నిత్తువా యీయవా?

మంథ—(స్వ) శబాస్. ఇది నాకంటె దుర్మార్గపుముండ. నాకె చమత్కారముతోఁచియె యుండదు.

దశ—హా! శ్రీహరీ! కైకా! నేననృతవాదినని యెంచితివా! ఇచ్చినదియిచ్చియే యున్నాను. మిన్నువిఱిగి మీఁదఁబడినను నిత్తును. అయిన ననుగ్రహించి సద్వరముల నడుగుము.

కైక—నీకు దుర్వరము లనిపించునవి నాకు సద్వరములనియె తోఁపవచ్చుఁగదా. నేనడిగిన వరముల నిచ్చెదవా లేదా యింతచెప్పుము.

దశ—నీవిట్టికట్టిఁడివౌదువని యెఱుఁగనైతి. వేఱొకటఁగానివని వరముల నెపమున సాధింపఁజూచెదవు కాఁబోలు. ఇట్టిదుర్మార్గురాలికి లేదన్నను పాపమురాదు. అయినను, సత్యబద్ధుఁడని జగమంతయు నన్నెఱుఁగుఁగావున నీకిచ్చెదను. త్రికరణ

శుద్ధిగా నిచ్చెదను. నీవరములలో మించివచ్చినది రామపట్టాభిషేకభంగముగదా? రామునెట్లయిన వేఁడుకొనఁగలను. ఆరెండువరముల నిప్పుడేయడుగుము. క్రూర కృత్యములన్నియు నొక్కసారిరాకానిమ్ము.

కైక—మిక్కిలి సంతోషము. అట్లయిన నడిగెదను. ఒకవరమునకు భరతుని పట్టాభిషేక మొనర్పుము. మఱియొక్కటికిఁ బదునాలుగేండ్లరణ్యమునఁ దాపసవృత్తిమై నుండునట్లు రేఁపేపంపుము రాముని.

దశ—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లి లేచి) కైకా—కైకా! నాపాడుచెవులకు నేఁడేమైన భ్రమ గలిగెనా లేక నిక్కముగ నీవు రామునరణ్యమునకుఁ బంపుమంటివా?

కైక—పదునాలుగేండ్లు.

దశ—హా! హా! శ్రీహరీ!

కైక—తపసివేషమున.

దశ—కైకా! కైకా!

కైక—రేఁపే.

దశ—అయ్యయ్యో! మారాముని పాలిటి దాయవై, నాపాలి మృత్యుదేవతవై, మాయింటికిఁ గాలసర్పమవైతివిగదే? ఏమిసంతోషమని యీక్రూరవర మడిగితివే. భరతునకుఁ బట్టము కట్టుటకుఁగాక, రామునరణ్యమునకుఁ బంపుట యేమికోరికయే. ఎవ్వని సుగుణము నాబాలచండాలముగ లోకులందఱుఁ బ్రశంసింతురో, యిక్ష్వాకుకులజులెవ్వరు నడపని సత్కీర్తి యీచిఱుతఁదనముననె యెవ్వఁడు వడసెనో, పరకాంతలఁ దల్లులుగఁ బరధనము హాలాహలముగ నెవ్వఁడెంచునో యేవాఁడు తనతల్లికంటె నెక్కువగ సవతితల్లులకు భక్తియొనర్చునో, తనభ్రాతలఁ దనశరీరములోని భాగములుగ నెవ్వాఁడు ప్రతీక్షించునో, యెవ్వనినొక నిమిషము వీక్షింపకున్న నేమనఁజాలనో, యట్టిమహనీయుఁడు, దిగంత విశ్రాంత యశోవిలాసుఁడు, దైతేయ తుషారచండభానుఁడు, పరశురామ గర్వభేది, కౌశికప్రియశిష్యుఁడు, సీతాప్రాణనాథుఁడు, నానిపై నీకిద్వేషమేల? నీకేమి వాఁడు విషముపోసెను? భరతునకు వాఁడేమియుండరాములఁ గలిగించె? నాసంతోషమున కగ్నిహోత్రము నిడితివి. హృదయమునఁ గాలకూటము నభివర్ధిల్లఁజేసితివి. నాపాలి కాళరాత్రి నైజనించితివి. కటకటా!! కైకా! నేబహుదినములు మనువాఁడఁగాను. విధాతృఁడిచ్చిన యాయువు నీవేలతగ్గించెదవు? నేదీనుఁడ—వృద్ధుఁడ—అనన్యథాగతికుఁడ నినుశరణొందిన వాఁడ. నీచరణములంటి నేవేఁడెదను గరుణింపుమా. ఈక్రూరవృత్తము మానుమా—నాపైదయరానిమ్మా. (నమస్కరించును.)

కైక—(ఆవలఁబోయి) రాజేంద్రా! ఈటుక్కులేల చేసెదవు? నే నేమడుగరానిదడిగితి? నీమోహమునకు నేను లోఁబడనని నిశ్చయము. (నిష్క్రమించును).

దశ—హా! దైవమా! నాకేమిప్రాప్తి దెచ్చితివి.

## అనుబంధము, 12

ఇన్ని దినములు మని తుదకీదిక్కు లేనిభంగి కలుగునే! అక్కటా! నేనుదీని నేల చేపట్టితిని. అయ్యయో! నాముద్దులపట్టిని-నా మోహపుతనయు నేనరణ్యములకుఁ బంపి యెట్లప్రాణముల ధరింతును. కటకటా! ఈమానికి నేనేల వరములిచ్చెద నంటిని? సత్యప్రతిజ్ఞఁ బాయుదునా? లేక దుష్కరణమున కియ్యకొందునా? ఎట్టిదుష్కరణము గల్గినను నానోటివెంట నాత్రిలోకసుందరు నరణ్యములకెట్లు పొమ్మందును? కామాతురుఁడనైయుఁ గఠినహృదయుఁడనియు, నన్నెల్లరు గువ్వకరిగొనితిట్టరోటు! కౌసల్యకేతెంచి రాముపట్టాభిషేక మేలమానితివన్న నేనేమి వచింపఁగలను? అయ్యో! పట్టాభిషేకము మాత్రము మానుట కాదే. ఘోరాటవులకుఁ బంపుటయే మారణవిధియే. ఈదుఃఖసాగర మేగతిఁదరియింతును? ఆ రాముఁడు-ఆర్థజనసురారాముఁడు-రిపుభీముఁడు కరుణాధాముఁడు వచ్చి నను మాటలాడించిన వానికి నేముఖము నెట్లు చూపుదు? రామచంద్రా! సద్గుణసాంద్రా! నీ ఋణము నాకింతయే సుమా. అకటా! ఎట్టికౄరకర్మునకు నీవు కొడుకవై జన్మించితివి. ఎట్టికులాంతకునకు సుతత్వము సమకూరె. ఎట్టినిర్భాగ్యుని, నెట్టిపాపు, నెట్టిపగదాయ నెట్టిద్రోహిని, నీవు తండ్రియంచు నమ్మితివి! నీముద్దుమోమింకెట్లు చూచెద? దైవమా! మా రామునకు జనకాజ్ఞఁ దిరస్కరించు బుద్ధియైనఁ గలిగింపుమా. అట్టిసంతసమైన నాకు సమకూర్పుము. అట్లయిన నిశ్చింతముగ మనఁగలఁగదా? ఆ రాముఁ డట్టివాఁడు కాఁడే. నేనేమి చేయుదును? దైవతోత్తములారా! ఇప్పుడే నా ప్రాణములఁ బాపరాదా? ఘోరభూకంపమిప్పుడే యుద్భవించి యీయయోధ్యనంతయు మ్రింగరాదా? కాలవ్యాళములారా! ఈకౄరకర్ముని మీవిషానలముల దహింపరాదా? ప్రాసాదమా! ఇప్పుడవిఱిగి నాపైఁబడరాదా? చిత్రరూపముననున్న పితృపతీ! నీవిప్పుడ సజీవుఁడవై నన్నుఁగొనిపోరాదా? అయ్యో! ఈప్రొద్దేటికిఁ బొడుచుచున్నది. జీవరాశి నిద్దురలేపి వారిహృదయము లలరింపఁగల కమలబాంధవుఁడు నాకేల తపనుఁడైయున్నాఁడు. ఈప్రొద్దయినఁ బొడువక జగమంతయు నిట్లేరాత్రిమయముగానుండి యంతరించిపోయిన నాకెంత సంతోషముగానుండును? ప్రభాకరా! నీవు మావంశకర్తవుగావా! నీకేల కరుణగలుగదు? అనుగ్రహించి యుదయింపకుండుమా. అక్కటా! అప్పుడే తొలిదెస యుదయదరుణకిరణ పురోగమసాంధ్యరాగముల ధరియించె. ఈసూర్యుఁడు తానేల యుదయింపకుండును. ఇంతైన నాపైనక్కటికము చూపఁడుగా!

ఖరకరుఁడనుట విదితమాయెను ఇప్పుడె నా నారాచమున వీనిరూపుమాపెద. (ధనువెత్తి) ఆహా! నాకేమి బుద్ధిమాంద్యము! నావిధిపైకోప మీభాస్వంతునిపైఁజూప నేమిటికెక్కెను? దశరథా! దశరథా! నీవీసూర్యుని మఱియొకనాఁడు చూడఁగలవా? ఇంకెక్కడి సూర్యుఁడు. ఎక్కడి దశరథుఁడు! హా! రామా! నిన్నుఁజూచిన వెంటనే నీతో నీకైకవరము చెప్పినవెంటనే దశరథుఁడు పొలియఁడా?

[ ప్రవేశము: సుమంత్రుఁడు. ]

సుమం—(దశరథుని సమీపించి) రాజన్యా! నరపాలకంఠీరవా! లెమ్ము లెమ్ము. ఇదె తెల్లవారెను. మంగళస్నానము వేళయాయెను. అభిషేకమండపమున శ్రీరాముఁడు సుస్నాతుఁడై లక్ష్మణుతోడ సుఖాసీనుఁడై యున్నవాఁడు. వసిష్ఠాదిసంయమీంద్రులు కర్తవ్యక్రియాకలాపముల నిర్వహించుచున్నారు. మీరాకం బ్రతీక్షించుచున్నారు. లగ్నమాసన్నమాయె. ధరాధిపచూడామణీ! పరాకు! ముఖ్యభృత్యుఁడు సుమంత్రుఁడు విన్నవించుచున్నాఁడు.

దశ—(లేచి కన్నీరునుంచి) హా! రామా! హా! దైవమా! (నేలఁబడును)

సుమం—హా! హా! ఏమిది?

[ పునః ప్ర: కైక. ]

కైక—సుమంత్రా! రామునిందుఁదోడితెమ్ము. పొమ్ము.

సుమంత్రు—

కం॥ మాతా యిది యేమిటికీ
భూతల నాథునకు వింత పొగులు గలిగెనిం
దేతీఱు నరయ నాకీ
యాతత శోకంబుగతము నానతియిమ్మా ॥

అమ్మా! కైకేయీదేవీ! ఇది యేమి రాజన్యుఁడు—

కైక—మాటలఁగాలహరణమేల? రాముఁడే తెంచిన నన్నియు విశదమగును వైళము పొమ్ము.

సుమం— (నిష్క్రమించును.)

దశ—కైకా! నాపైనింతయైన నీకుఁగరుణకలుగదా? నేనేమపరాధమొనర్చితి? నాయెడ నీకున్నదని యనుచున్న మోహమున కిదియా తార్కాణము? రాము నేల పిలిపించితివి? వానితో నేనెట్లు మాటాడుదు? దేవీ! నీవుకాకున్న నన్నెవ్వరు రక్షిం

చుకారు? నాయపరాధము లెన్నియున్నను గారుణ్యాభావమున క్షమింపుము. కాకున్న నీయాన నేనసువుల భరింపఁజాల. ఈవృద్ధునిపై గార్పణ్యము మానుము. ననురక్షింపకున్న విడువను. అభయమీకున్న మానను. (అని కాళ్ళంటఁబోవ),

## అనుబంధము 13

కైక—(విదలించి) రాజేంద్రా! ఈవాగత్యమేల? వరములీ లేదనును. ఈయాగడ మేల? నాసవతి కౌసల్యకు భీతల్లి నాకు మ్రొక్కెదవా? ఇంకఁజాలుపొమ్ము—

[ ప్ర: రాముఁడు-లక్ష్మణుఁడు-సుమంత్రుఁడు (ప్రక్కన). ]

రాము—సుమంత్రా! ఎందున్నాఁడు మాయయ్య? ఎందున్నాఁడు?

సుమం—దేవా! ఆధవనమునను న్నాఁడు.

రాము—అయినఁ బోవుదము.

దశ—కైకా! ఇదె రాముఁడువచ్చినజాడతోఁచుచున్నది. ఇఁక నేమనఁజాలను. ఇమ్మా నాకభయము? (కాళ్లఁటును).

కైక—ఈవగలింకఁ జాలు నూరకుండుము.

దశ—ఎంత కఠినాత్మురాలవే! ఎంతటి కిరాతకివే. అయ్యో! (ముసుఁగిడును).

రాము—(దశరథునొద్దకువచ్చి) అయ్యా! అయ్యా! సుమంత్రునియెదుట నీవు కన్నీరు నించితివఁట! నీకెట్టిదుఃఖముగలిగె? నేఁడేల నన్నుఁజూడకున్నావు? ముసుఁగైవను దీయుము. నీమోము నిట్లు వాడఁగూడని యంతపరాధము నేనేమిచేసితిని? ఎప్పుడు నను వీక్షించినను గౌఁగిలించుట మానవే. ఇప్పుడు నేవచ్చి యింతసేపయినను జూడ వేల? నీపెదవినుండి మాటవెడలినంత నేనెట్టికార్యము నైనఁజేయఁగల కొడుకులుండ నీకేల యీదుఃఖము. అయ్యో! నీముసుఁగున నీవక్షోభాగ మెగిరిపడుచు నీకుఁగల యపారదుఃఖము వెల్లడించుచున్నదే. నిన్నసాయంతనమున ననుఁబట్టాభిషిక్తుఁ జేసెదనని మహానందమున మాటలాడితివే? ఒక్కరాత్రిలో నాయానంద మెందుఁ బోయెను? ఏభూపతుల నీవెటఁగాసిపెట్టితివి? ఎట్టి శరణాగతుల శత్రువులకప్పగించితివి? ఎట్టి సత్యములు జరుపలేకపోయితివి? ఎట్టి పరధనముఁ బరస్త్రీల నీవు కాంక్షించితివి? నీయేకకుమారున కెట్టియాపదగలిగె? అయ్యో! ఆగిరివ్రజపురమునుండి యేమైన వృత్తాంతము తెలిసెనా? భరతశత్రుఘ్నులు క్షేమముగనున్నారా? అయ్యో! నీవు మాఱుమాట పల్కకున్న నాప్రాణములు నిలువఁజాలవు. ఒక్క మాటాడి నాయనుతాపముఁ దీర్పరాదా?

## అనుబంధము 14

(పైఁబడి యేడ్చును).

దశ—(ముసుఁగు తీయక యే రాముఁ గౌఁగిలించి) రామా! రామా! (ఏడ్చును).

రాము—మాతా! కైకేయీదేవీ! ఇదేల మాయయ్య యిట్లు దుఃఖించుచున్నాఁడు? నీకుఁ దెలియక నాజనకునకింత పాటుగలుగునా? ఏల యూరకున్నావు? ఎట్టి వార్తకాని కొంకక వచింపుము.

కైక—కుమారా! దేవాసురుల యుద్ధమునాఁడు మీతండ్రి నాకు రెండువరముల నిచ్చి యుండెను. వాని నిప్పుడడిగితి. భరతునికిఁ బట్టముగట్టనొకటికిఁ, దాపసవృత్తిమై, నేఁడే నిన్ను బదునాలుగేండ్లరణ్యమునకుఁ బంపనొక్కటికి వేఁడితి. ఇచ్చెను. ఆమాట నీకుఁ జెప్పుటకు వాయోడి శోకించుచున్నాఁడు.

దశ—హా! రామా! హా! రామా!

లక్ష్మ—కైకేయిదేవీ! ఇట్టిఘోరవరములా—

రాము—లక్ష్మణా! ఊరకుండుము. జనకా! ఇంతకార్యమునకింతయోచించవలయునా? నీవు శోకించుటకైన దీన నేమున్నది? పదునాల్గేండ్లు నన్నరణ్యమున నుండనియమించుటయా శోక కారణము? భూప్రదక్షిణాభిలాషము నాకుమిక్కుటముగ నున్నదని యెన్నిమారులో విన్నవించితి నే? పట్టాభిషేకమునకియ్యకొనునప్పుడును నీయానతి మీఱరామిచే సమ్మతించిఁగాక, నాకు దేశదర్శనాభిలాషమే మెండుగ నుండెను. నేఁబ్రార్థించినను నీవనుగ్రహింపకుండినయర్థ మీదేవి నాకిప్పించి స్తోత్రపాత్ర యయ్యె. కావున దీనికై శోకింప నేటికి? ఇంక భరతునిపట్టాభిషేకమునకు శోకించెదవా? నాసోదరుఁడే? నాపైగూర్మిగలవాఁడే? నీ కొడుకులలో నెక్కుడగు భక్తికలవాఁడే. అట్టివాఁడు రాజ్యమేలుట నీకును నాకును సంతోషకరముగా నుండవలయుఁగదా? నీవు నాకభిషేకము చేసి యుండినను, మా భరతు రాజ్యమున నిల్పి నేదేశదృక్షచే వెడలవలయునని యే యుంటి. మున్ముందే యీమాటచెప్పకొన్న నీవు సమ్మతింపవో యనుభయమున నీకుం జెప్పకుంటి. ఈతల్లి వరముల వ్యాజమున నాయభీష్టము నెఱవేర్చి, పరమసమ్మదమావహింపఁజేసెఁగా! ఇదియింతయొప్పనే! ఇవియన్నియునిట్లుండ వరములిచ్చిన వాఁడు తండ్రియఁట. వేఁడినది ప్రేమగల తల్లియఁట. రాజ్యమేలువాఁడు విశ్వాసపాత్రుఁడగు తమ్ముఁడఁట. ఇందున నేదిమీఱఁ దగినది? జనకా! ఇంచుకయు యోచింపకుము. ఈపదునాల్గు సంవత్సరములును బదునాల్గు దినములుగాఁ గడచనఁగలవు. నేనవశ్యము పితృవాక్యమును జరిపెద. ఒండనకుము. ఇదేపోయి మిగిలినతల్లులతోడ నీసంతోషవార్తచెప్పి వచ్చెద.

## అనుబంధము 15

నాశానలిమ్మ (పోవుచుండ)

దశ—(లేచి) రామా !—శ్రీరామా !—నిన్ను మాన—

రాము—(మరలివచ్చి) జనకా ! శోకింపకుము. ఇది యేలొకో యిట్లు శోకించెదవు?

రాము—
లక్ష్మ—
} (నిష్క్రమించుచు).

దశ—రామా ! రామా !

లక్ష్మ—(ప్రక్కన) జనకుఁడు మరలఁ బిలుచుచున్నాఁడు.

రాము—ఊరక కలువరించుచున్నాఁడు. మరలవత్తుముగదా? పోదము—

(నిష్క్రమింతురు)

దశ—(గట్టిగా) రామా ! రామా ! రామా !

(ముందు యవనికపడును)

—* ప్రథమాఙ్కము సమాప్తము *—





# పాదుకాపట్టాభిషేకము.

## ద్వితీయాఙ్కము-ప్రథమరంగము.

### కౌసల్య యిల్లు.

[ ప్ర: కౌసల్య (మంగళద్రవ్యములిడుకొనియుండి క్రిందఁబడియుండును) రాముఁడు లక్ష్మణుఁడు శిశిరోపచారములు చేయుచుందురు]

### అనుబంధము 16

కౌసల్య—(లేచి) తనయా! నేఁడుదయమున లేచి నేనెట్టిపాపిముఖముఁ జూచితి? నిర్ఘాతపాతముఁబోలినయీ బెట్టిదపు వార్తవింటిని. నాహృదయ మెట్టివజ్రకఠినమో! యీవార్తవినియు వ్రయ్యలుగాకున్నదే! అయ్యో! నీపట్టాభిషేకమునకని యీ మంగళద్రవ్యముల నేకరించియున్నానే! హా! కైకా! ఇన్నిదినములనుండి యింత ప్రీతిపాత్రవుగానుండి తుదకు సవతిమత్సరము సాధించితివే! తనయా! తనకొడుకు రాజ్యమేలిన నేలుఁగాక, నిన్నేల యడవులకుఁ బొమ్మనవలయు. ఇంతటిపగ యెందైనవింటిమె? ఈమాటకైక నీతో నెట్లాడఁజాలెను? ఆపతి యిందుల కెట్లు సమ్మతించెను? తనకుఁగూరిమిగల కాంతకు వరము లిచ్చిన రాజ్యమంతే యిచ్చెనప్రాణమైనను సరకుసేయక యీవచ్చుఁగాక పెద్దవారి కొడుకుల నరణ్యములఁద్రోయఁ జెప్పునే? తనయా! నినుఁబాసి నేనెట్లునిర్వహింతును? నన్నెవ రాదరించువారు? అయ్యో! కొడుకరణ్యములకేగెడు. పతినిఁగైక కొనియున్నది. ఇంకెట్లు భరింతు? తనయా! జనకుఁడుపొమ్మన్నంతనే యేయపరాధము లేక నీవరణ్యములకేల యేగవలయు? రాజ్యమాశింపకుము. భరతునెగ్గులాడకుము. అయిన, నరణ్యములమాని నాయొద్దనుండుమా. జనకాజ్ఞపాలింపఁదగినదియైన జనని యాజ్ఞపాలింపఁదగనిదియా? నీవు ననుఁబాసిన నాప్రాణములు నిలువవనుట నీవెఱుఁగవా? మాతృవధకైన నియ్యకోలు గావించు పిత్రాజ్ఞయుంగలదా? కుమారా! నీవాకైకగర్భమున జనింపక నా నిర్భాగ్యగర్భమున నేల జనించితివి?

### అనుబంధము 17

లోకసంరక్షణశాలి యగుకొడుకు నాకుండియు, గొడ్రాలుకంటె నికృష్టమగు దశ నాకుఁ బ్రాప్తించెఁగా! తనుజా! నీపాదరేఖలాసిగాఁ జూచిన సాముద్రికులు నీవు ధరణీభరణదక్షుండ వగుదువనిరి. వసిష్ఠాది సంయమీంద్రులు నినుఁ జక్రవర్తిపదస్థుఁడవుగమ్మని దీవనలిచ్చిరి. ఆశాస్త్రముల నాదీవెనల నీకైకయొక్క మాటమాత్రమున నబద్ధములఁ జేయఁజాలెఁగా? నీవు జనించినదాదిగా నినొక్కనాఁడుఁ బాసియుండుఁగనే! ఈవియోగసాగర మేగతిఁ దరింతు? ఏమనేఁ డేండ్లు నినుఁ బెంచినది యిట్లవుటకా? పెంచిన ముద్దుచిలుకను బాపుడుగాని కప్పగించినట్లాయెఁగా? అయ్యయో! నీవు నాకుఁగలుగుట కెన్ని దైవములఁ బూజించితిని! ఎన్ని వ్రతముల నాచరించితి! ఎన్నియుపవాసములఁ జేసితి. ఇట్లుసాటుపడి కులాభరణమైన నిన్నుఁ గనినది యీకైక కొప్పఁజెప్పుటకా? అనుకంపలేక నన్నుఁ బాసిపోవ నీమనసెట్లొర్చెను? తనయా! రామా! వలవదు సాహసమా యీ యాచరణము.

రాము—జననీ! నీవిట్లాడకుము. జనకాజ్ఞకైకదా పరశురాముఁడు తల్లినైనం జంపెనది? నాకు జనకాజ్ఞయెట్లో నీకును బతియాజ్ఞయట్లేగదా? యోచింపకుమా అడిల్లుము.

సీ॥ తల్లి యెన్నఁడుగాని తప్పఁ గూడనిభంగి
వెలసెడుపతియాజ్ఞఁ దలఁప వలదె
యిన్నాళ్లుకీర్తిమై మన్నతండ్రికి సత్య
కలుషఁ మబ్బెడుభంగిఁ దలఁప వలదె
కల్గనే నఁ బితృవాక్యపాలనము మీఱఁగ లేని
తనయుపుత్రత యింత తలఁపవలదె
యెట్టికష్టములైన నెలమిఁ గొన్నాళ్లలోఁ
దొలఁగఁబోరుట యింత తలఁపవలదె

తే॥ గీ॥ వనికిఁ జనఁగలోకంబేమి మునిఁగెనమ్మ
కడచుఁ బదునాలుగేం డ్లెంతకాలమమ్మ
వనటఁ గుందంగ నంతేమి వచ్చెనమ్మ
కడఁగి మాయమ్మ శోకంబు విడగదమ్మ॥

నేకొక్కఁడఁగదా కొన్నిదినములు లేకుండునది? ఇందులకింతయేటికి? భరతుఁడు నాకంటె నీయెడ భక్తిపరుఁడు. ఈలక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు నట్టివారే. వీరుండ నీకేమికొఱఁత? నీవుదుఃఖించి యేమిప్రయోజనము? నాకాజ్ఞ నిర్వహింపకున్నఁ దప్పదు.

కౌస—రామా! అయిన నీవు పోవ నేవలయునా ? నాయాజ్ఞ నిర్వహింపవా?

రాము—తల్లీ! నన్నేల సంకటమునకు గుఱిచేసెదు? పితృాజ్ఞయనుల్లంఘ్యంబు. నను మన్నింపుము. సుమిత్రాదేవియొద్దకును సీతయొద్దకును బోవలయు. మరల నీయెడ కేతెంచి నీతోమాటలాడఁగలను.

కౌసల్య—

ఉ॥ అవ్యయలీల నీకు వసుధాధిప పట్టముగల్గ రాజరా
జ్యేన్వ్యుఁడ వై వెలుంగ నభిషేకము వేళనునీకొసంగఁగా
భవ్యముగాఁగఁ గూర్చితినపారముదంబున నింకమంగళ
ద్రవ్యము లేమిసేయుదు విధాత్మన కింతచలంబు గల్గెనే॥

అయ్యో! ఈమంగళద్రవ్యములుగలవే వీనినేమి చేయుదు.

రాము—

చ॥ అడలకుమమ్మ మీఱఁదగదమ్మ ధరావరుఁ గల్లసేయు టె
న్నఁడుఁవలదమ్మ యీపదియునాలుగువత్సము లింతలోన నే
కడచనునమ్మ నామనవిఁ గైకొనుమమ్మ యలంతనాకు ని
మ్మడియగునమ్మ వీనికినమస్కృతు లేనొనరింతు నమ్మరో॥

(ద్రవ్యములకుఁ బ్రదక్షిణ నమస్కృతి సేయును).

కౌసల్య—హా! శ్రీహరీ! (మూర్ఛిల్లును).

(యవనికపడును).

---

## ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.

---

### సీతవగరు.

[ ప్ర: రాముఁడు-సీత ]

అనుబంధము 18

సీత—నాథా! ఇట్టిక్రూరభంగి నీకుండుట యొకనాఁడు నెఱుఁగఁగదా? నీకు రాజ్యము లేకుండుటకే నోర్చితి. భరతునికిఁ బట్టాభిషేకమగుటకు మొదలే యోర్చితి. అరణ్యవాసమున కింతయైనఁ జింతింపను. సకలసంపదలు వాయుటకోడను. కాని నిన్నుఁ బాసియుండుటకే నోపనుమా? నాయాన నీపాదములాన నేనింపుండఁజాల పరీక్షించుట కిట్లాడెదవుగాక నిక్కమని నేనమ్మను. నీవడవులకుఁబోవ నీవెంటనున్న నాకెందును గొఱవడదు. నన్నడవిపాలు చేయుట కేసహింపను. నీచరణములంటి వేఁడెద. వలవదుడుగుమా యీభయంకరకృత్యము! నన్నుమానుటయా? నే నేమపరాధ మొనర్చితి. నాపాడుచెవులెట్టి మాటలవినెను! మనోనాథా! నీవభయమీకున్నఁ బ్రాణముల ధరింపఁజాల.

రాము—కాంతామణీ! ఆయరణ్యముల నీవు నాతో నెట్లుండఁగలవు? ఉద్యానవనముల సంచరించునపుడు కోమలలతలఁ ద్రొక్కిన నీకాళ్లు నొచ్చుచుండునే. అట్టా నేల కాలెట్లూనఁగలవు? వీణాస్వనమే యొకొక్కసారి కటువుగాఁదోఁచెడు నీకుఁ గాననమృగారావమెట్లు సహ్యమగు? చిత్రప్రతిమలలోని సింగముల రాక్షసులఁ జూచి భీతిల్లు నీవు ప్రత్యక్షహర్యక్షముల రాక్షసులఁ గాంచి యెట్లోర్వఁగలవు? నీవు నాతోడనుండుట నీకు సౌఖ్యమా? నాకు సౌఖ్యమా? వలదుడుగుము. నామాటవినుము.

అనుబంధము 19

సీత—ప్రాణేశా! పతిమాటవినకుండుట సతికిఁ బాపమగుట నేనెఱుఁగనిదానఁగాను. ఐన నిట్టిమాటలు వినకున్నను దోషముగలుగదు.

కం|| మృతిబొందఁ గోరె నేనియుఁ
బతిమాట వినంగవలయుఁ బాడి యెఱుఁగుదు
బతి తన్నుఁ బాయనెంచిన
సతి వలదనుమాట కలుషసహితం బగునే ||

నీవింక లేకుండిన నిదియే నాకరణ్యమగు. ఈహంసతూలికాతల్పమే శిలామయతల్పమగు. ఈసౌధాంతరమే పర్ణకుటీరముకంటె నికృష్టమగు. ఈపరిచారికలే నదీనదములగు. నాచెలికత్తియలే రాక్షసులగుదురు. అయ్యో! ఈయరణ్యవాసము నాకేల కల్పించవు? ఇటుమానిపోవుటకా మాజనకుండు నను నీకిచ్చినది? ఇట్టిదుస్తర వియోగము ఘటించుటకా యగ్నిసాక్షిగ నన్నుద్వాహమైనది? భూరమణా! అడవులలో నీవలయునెడ నీకుపచర్యసేయ నేనువలదా? కైకేయి యేమయిన నన్నుఁ బోవలదనెనా? అట్లయిన నామె పాదములపైఁబడి వేఁడికొందును. ఆమెకు నీయట్టి నిష్కరుణగలదేమో చూచెద. ఓపనోప. నినుఁబాసి నేనిందుమననోప. నీచరణములాన నేమాననోప. రక్షింపుము. రక్షింపుము.

## అనుబంధము 20

(కాళ్ళపైఁబడును)

రాము—హా! ముఖము—కామినీ! లెమ్ము. లెమ్ము. ఏలయిట్లఁతఁజెందెదవు? అడవుల కీపిడుగులఁబడ లేవనిపల్కితిఁగాక నిన్ను మానిపోవ నాకుఁగోరికయా? నీసరసనున్న యరణ్యమే నాకు స్వర్గము. పర్ణశాలయే నాకింద్రభవనము. కందమూలములే భక్ష్యభోజ్యములు. ఊఁఅడల్లుము.

[ ప్రవేశము: లక్ష్మణుఁడు-(దూరమున) ]

లక్ష్మ—(దూరము పోవును).

రాము—లక్ష్మణా! రమ్ము. ఈసీత నావెంటవచ్చెదనని కన్నీరుక్రిచ్చి యొకర్చె. సంతాపముఁజూడఁజాలకియ్యకొంటిని.

లక్ష్మ—ఊఁ—

రాము—ఏమూరక "ఊఁ"—అంటివి? లక్ష్మణా! నీచందము నేఁడు చిత్రముగానున్నది. మనసార నొకమాటయిన నాడవు. ఇక్కడికేలవచ్చితివి?

లక్ష్మ—రమ్మనియున్న వచ్చితి.

రాము—నేను నిను రమ్మంటినా?

లక్ష్మ—రమ్మనకున్న నూరకయేవచ్చితి.

రాము—నీజాడలు నాకేమియుఁ దెలియవు. ఎట్లువచ్చియున్నావు. దశరథునొద్దకుఁ బోవుదము రమ్ము.

లక్ష్మ—ఊఁ— (రామలక్ష్మణులు నిష్క్రమింతురు)



## ద్వితీయాఙ్కము-తృతీయరంగము.

---

### కైకయిల్లు.

[ ప్రవేశము: మంథర ]

మంథ—ఇప్పుడు కొంచెము నెమ్మది గలిగియున్నది. ఇంకఁ దిరుగుటకు దారిలేదు. ఈ ప్రభావమూరంతయు నప్పుడే తెలిసినది. ఊరిముండలందఱు నప్పుడే యేడ్చుచున్నారు. ఏడ్వనీ! ఇంకను నేడ్వనీ! రాముఁడరణ్యమునకుఁ బోయిన నీవిధవలకంతయు నేమి పోయెనో. అక్కడఁ గౌసల్య తెరయో కండ్ల నీళ్లొలుకగ నేడ్చుచుఁ బోవుచున్నది. ఆహా! నన్నుఁ జూచి యావైపున మోముఁ ద్రిప్పిపోవుచున్నది. (దగ్గను) తిరిగియే చూడదు. దీనికేమి విషము పోసినాను.

[ ప్రవేశము: -కైక. ]

కైకా! ఎట్లు?—

కైక—మంథరా? ఎంత కార్యమాయెనే! ఏమి యుత్పాతము గలిగెనే! నా పతిసంతాపము చెప్పఁజాలను ఇంకేగునని యెఱుఁగ.

మంథ—అయిన దయినది. ఇప్పుడు చింతించి ప్రయోజనమేమి?

కైక—

అనుబంధము 21

ఆసంతాపమున నా నాథుఁడు జీవింపఁగలఁడా యని సంశయము పుట్టుచున్నది.

మంథ—పీడవీడినది.

కైక—దుర్జాతివిధవా! ఇంతచేసి యిట్లాడెదవా?

మంథ—నీవు కానున్నానంటిని. నన్నేల విధవాయనెదు?

కైక—అయ్యో! ఏమి ప్రాప్తి దెచ్చుకొంటిని. దైవమా! ఇప్పుడేమి చేయుదును.

మంథ—సులభముగనే యున్నదే చేయఁదగినపని. తప్పొప్పులని దశరథు క్షమింప వేఁడుము. పిదపఁ గౌసల్యకాళ్లఁబడుము. రాముని పట్టాభిషేకము చేయింపుము.

కైక—చేయుదునా యట్లు?

మంథ—పిదపఁ జేయఁదగినది వినలేదే

కైక—అది యేమి?

మంథ—తర్వాత భరతునిఁ గొనిపోయి యొకకూపమున నూకి నీవును నొకగుండుకట్టుకొని దుమికి చావుము. విధవాత్వము తప్పవలయునన్న వేఱుమార్గము లేదు.

కైక—నా నాథుఁడు క్షమించిన పిదప నేనేల చావవలయు?

మంథ—నేను నీకు హితము చెప్పుదాననా? నా మాటలు నీవు విందువా? నన్నే ఱడిగెదు పొమ్మా. నాకింతకంటె నుపయోగమైన పనిగలదు. నిన్నుమాని తనకు దాసినైన బహుమాన మిచ్చెదనని కౌసల్య చెప్పిపంపినది. బ్రదుకు తెరువుచూచి కొందును.

కైక—మంథరా! దశరథుఁడు క్షమించిన నాకేల క్షేమకరముగాదు?

మంథ—భరతుఁడు నీకుఁ గలిగినట్లులేదు. వాఁడు నీకు సవతికొడుకు. వానిపాలి పగదాయ వైతివి. క్షమింపవేఁడిన దశరథుఁడు నిన్నేల క్షమింపఁడు? అతఁడేమి సామాన్యుఁడా? మొదట వరముల నడుగక యూరకే పోదునని యొట్టుము పెట్టితివే. అప్పుడెవ్వనన్నఁ గోపమున దుమికెదనని పోయితివే. అప్పుడేమైన వలదనెనా? అవశ్యము వదుమనెను. తర్వాత వరము లడిగి నిర్బంధించినప్పుడుగదా నీ కాళ్లు పట్టుకొన సాగెను. అబ్బినసిగ—అబ్బకున్నఁ గాళ్లుగదా నీమగనికి? ఇట్టివాఁడిప్పుడొక వేళఁ దనకార్యసాధనమునకు నిన్ను క్షమించినను దరువాత నిను మాటలాడించునా? కన్నెత్తియయినఁ జూచునా. "ఇది కాలసర్పము. దీనియొద్దఁ జేరిన వినాశమగు" ననియెంచి నీయొద్దకైన వచ్చునా? ఊరివారందఱు "ఎట్టిపలుగాకి యీకైక" యని తిట్టుట మానుదురా? నీవప్పుడు గాడిదెపైనెక్కి నీపుట్టినింటి కేగవలసివచ్చుఁగదా? అప్పుడు బ్రదికినమగఁడుగల విధవ వయ్యెదవే. ఇంకేమున్నను నీ మగని వరము లడుగఁ గలవా? ఉన్న రెండువరములు వరిసగా వ్రీజెంజె. ఇంకేమో మున నడుగఁ గలవు? ముఖ్యము కౌసల్యయే యదృష్టముగలది. "భోగిని యగుభార్యయడిగిన వరము లిచ్చినపతి పట్టపుదేవి నేనడిగిన నెట్లిచ్చెడో యెట్లు నిన్నడవికిఁ బంపునో చూతము" అని యింతకుముందుఁ గౌసల్య రామునితో ననెనఁట. దాని యభీష్టము నీవలననే నెఱవేఱఁగలదు. పట్టినపట్టు సాధింపవలెనన్నఁ గౌసల్యను జెప్పి యితరులఁ జెప్పవలయు. దాని చరణములపైఁబడుము. నీ కంత వఱకు బుద్ధిగలుగదు. పతియఁట! చచ్చునఁట! ఏమయినదే నీపతికిప్పుడు? అరణ్యములకుఁ బోవు రాముఁడు మరలరాక యట్లే పోయిపోవునా? చత్తునని నీపతిచెప్పుకొనెఁ గాఁబోలు. దాని నీవు విశ్వసించితివి కాఁబోలు. మాటలలోనే ప్రాణముఁబోఁ గొట్టుకొనువాఁడు గాబవలె నిన్నిదినములు బ్రతికియుండునా? మోసకారి పతి మాటలకింత గోలవవుదువు గనుకనే కౌసల్య నిన్నిట్లు చెవులుపట్టియాడించుచున్నది. విశ్వామిత్రుని వెంట రామునిఁ బంపునప్పుడు నైతము నీపతి ప్రాణముల విడుతునని యిట్లేనాగత్యము చేయలేదా? విశ్వామిత్రుఁడు విడిచెనా? నీపతి గ్రుడ్డువెట్టెనా? ఇంక నీతో మాటలాడుటకుఁ గాదు. నానోరు నొచ్చుచున్నది.

కైక—మంధరా! నీమాట నిక్కము. ఇప్పుడు వెనుదీసిన నపకీర్తి యొక్కటియే నిలుచు. నీవలె హితముచెప్పువారు నాకులేరు నీయుపకారమున కేమొనర్తును? కొమ్ము చంద్రహారము (ఇచ్చును.)

మంథ—(పాఱవేసి) నన్నుఁ దిట్టుటకిదియా యుక్తి? కూలికి నీకు హితోపదేశము చేసితి ననుకొంటివా? రేపు నీకొడుకును "చక్రవర్తి" యనిపిలువ నీవు చక్రవర్తి మాతవై నన్నాదరించిన నా సంతోషమే చాలునాకు బహుమతి.

కైక—(మంధర నాలింగనముచేసి) మంధరా! నీకు నాయెడ నవ్యాజకరుణగదా? అదియేమే మంథరా! వీధిని గలకలము?

మంథ—చూడుమదె కౌసల్య వచ్చుచున్నది. జనులందఱు దాని దుఃఖమును దమదుఃఖముగా భావించియున్నారు. అందులకే యీయలబలము.

కైక—ఇదేమే కౌసల్య పాదచారిణియై పల్లకి లేక వచ్చుచున్నది?

మంథ—ఇంతటితోఁ దీఱెనా? నీచరణదాసి కాఁజాలదా? ఒక్కమాట. ఇది గయ్యాళి. టక్కులాఁడి దీనిమాయలకు మోసపోవకుము నీవిందుండకుముపొమ్ము.

కైక— (నిష్క్రమించును)

[ ప్రవేశము: కౌసల్య ]

కౌసల్య—మంథరా! రాజన్యుఁడును గైకేయియు నున్నారా?

మంథ—(ఏడ్చుచు) అమ్మా! యేలపోయెదవు? ఈ దుర్జాతి కైక విడువని పట్టుపట్టి రాజేంద్రుని బాధింప సత్యవ్రతుఁడైన ధరణీశుఁ డేమి చెయఁగలఁడు? ఇదియెంతటి పలుగాకి! దీనియొద్ద నేనుండను. దీనికొడుకే యీ సామ్రాజ్యమేలనీ. నీపాదముల శరణొందెదను. మనము నరణ్యమునకుఁ బోవము రామువెంట. (కాళ్లపైఁ బడును).

కౌసల్య— (కన్నీరునించి లేవనెత్తి) మంథరా! నీ యుపదేశమైనఁ గైక వినదాయెఁగా? నీ వేమి చేయుదువు? ఎందున్నాఁ డారాజన్యుఁడు!

మంథ— ఆగృహమున నున్నాఁడు. అయ్యో! భరతుఁడెట్టి కులటాసుతుఁడాయె!

కౌసల్య—భరతు నేల యిట్లాడెదు? వాఁడు నిరపరాధి. (పోవును)

మంథ—(నవ్వి) పొమ్మా, నీకు క్షురకర్మకాఁగలదు. (ప్రక్కకుఁబోవును.)

(వెనుక యవనిక నెత్తిన దశరథుఁడు-పడియుండును)

కౌసల్య— (దశరథుపైఁబడి)

## అనుబంధము 22

[ప్రవేశము-సుమిత్ర].

కౌసల్య—నాథా ఇదేమిట్లు మీరాముని(గాన( బట్టించితివి?

సుమిత్ర—హా! నాథా! నే(డేమిదుర్దినము? పట్టాభిషేకమహోత్సవము తుదకిస్థితికి( బరిణమించెనే!

కౌసల్య—నాథా! ఏమి మాట్లాడకున్నావు? ఇట్టిరియు వరములగునా? యుక్తాయుక్తకములు పరిశీలింపవలదా? అయ్యో! రాము(డే. నీమోహపుకాము(డే. అట్టివాని నటవీస్థలికంప వీమన సెట్లొర్చెను? ఈసంతాపము నీవైన ధరింప(గలవా? నేనేమి తప్పొనర్చితి? కైక నీకు మెచ్చులా(డియైన భరతు( బట్టము గట్టుము. కాదనను. నాకొడుకును మాత్రము నాయొద్దనిలుపుమా. నాకు(బుత్రభిక్షమిమ్మా. నీకు నల్గురు కొడుకులున్నారు. నాకొక్క(డేకదా?

సుమిత్ర—నాథా! రాము నేల యరణ్యములకు( బంప? ఈదుఃఖము మన మెవ్వరమైన సహింప(గలమా? అయ్యో!

దశ—(లేని యొడ్చి) కౌసల్యా! సుమిత్రా! నాముద్దుకుమారు మనసార నరణ్యమునకు నాజ్ఞ వెట్టితినని యెంచితిరా? కటకటా! ఆకొడుకును బాసిన రెండవక్షణముననే నేశ్మశానమున దగ్ధు(డు కావలదా? ఎట్టిపాడువేళ నే నీకైకకు వరముల నిచ్చితి. ఈకైకను జేపట్టి కులమువారికందఱికి( బుత్రునకు మీకు శాత్రవు(డనైతిని నిన్న పాయంత్రిసమునకుముందు నేమృతి( జెందియుండిన నాకీదుఃఖముండదుగదా? కైకా! కైకా! నినుగన్న కడుపు దగ్ధమగు(గాక.

## అనుబంధము 23

కౌసల్య—రాజేంద్రా! నాప్రాప్తియిట్లుండ నాకైక యేమిచేయును. ఆతన్ని( బిలిపింపుము. ప్రార్థించెదను.

దశ—కైకా! కైకా!

కౌసల్య—కైకేయీదేవీ! రమ్మిందు, నేవిన్నవింతు.

కైక—(వెనుకనుండి) నాకాయాసముగనున్నది. రా(జాలను.

దశ—కౌసల్యా! దాని నేటికి(బ్రార్థింపనెంచెదు? ఏపనిచేయవలెనో యదిచేసె. ఇంకేల వచ్చును? ఆ(తికైన( గరుణగల్గు దానికి(గల్గదు.

[ప్రవేశము: వసిష్ఠు(డు-సుమంత్రు(డు].

వసి—రాజేంద్రా! రామలక్ష్మణులు సీతాసమేతులై వచ్చియున్నారు.

దశ—హా! శ్రీహరీ!

వసి—నేనప్పుడే చెప్పితినే. దుఃఖముతో నేమిప్రయోజనము? ఇది దైవకృతము. వారలఁ బిలిపింపుము.

దశ—ఋషితిలకా! ఇంక మనసు రాయిచేసితి. చావనున్నవానికి వగ పేల? ఆ రాముఁడు కడమాట నాయానతిఁ గైకొన వచ్చియున్నాఁడుకాఁబోలు. రమ్మనుము. కడసారి వాని ముద్దుమోము వీక్షించెదఁగాక.

[ ప్రః రాముఁడు సీత (దూరమున లక్ష్మణుఁడు) ].

లక్ష్మ—(స్వ) దశరథుఁడుగాని కైకగాని తుదకుఁ గరుణింపవచ్చునని యూహించితిని. ఊరకుంటిని. కాని. ఇంతను వేళగలదు ఈరాముఁడు నేఁబోయివచ్చెదనని చెప్ప దశరథుఁడేమి, నవ్వైనఁ గైకకుఁ గరుణగలుగదా? నేనిందేయుండెద. ఆవ్యాళమిథునము చేరియున్న యాగుహాలోనికిఁ బోవలెను, (నిల్చును).

రాము—(దశరథునకు నమస్కరించి) జనకా!

దశ—రామా! రామా! నీవు నన్ను "జనకా"! యని పిలుచుటి దియే కడసారిగదా?

రాము—జనకా! ఊరడిల్లుము. నీకేటికీవగపు? పదునాలు గేండ్లేయని భీతిల్లెదవుగాక శీఘ్రకాలముననే యవి నిండఁగలవనుట చింతింపవు. నే సంతోషమున నరణ్యముల కేగెదనే నీకేల యీసంతాపము? నీవలెఁత లోదిన నేనోర్వఁజాల. నే నిందుండఁజాల. నీయానతిఁ గైకొనకయే వెడలిపోయెద. ఈసీత నాసంతోషము నినుమడింపఁజేసె. నేనెంత చెప్పినను మానక నావెంటవత్తునని పట్టుపట్టె. నేనునియ్యకొంటి. మీయాజ్ఞ యొకటియే వలయు. ఒంటిగానుండక సతీయుతుఁడనై యుండెదఁగదా? ఇంకేల చింతింపవలయు

దశ
కౌసల్య } హా! సీతా! సీతా!
సుమిత్ర

రాము—మీరెవ్వరుగాని దుఃఖించిన నేనిందుండను. ఇదే వెడలెదము.

ద-సు-కౌ—మేము దుఃఖింపము-దుఃఖింపము. (దుఃఖింతురు).

రాము—మాతా కైకేయీ మాత యెక్కడ?

దశ—కైకా! కైకా!

[ ప్ర: కైక మంథరతో (ఒకప్రక్కన) ]

మంథ—(కైకతో) నీకున్న ధైర్యమంతయు నిప్పుడే యుపయోగింపవలయు. తిరిగి తివా కార్యము దప్పును. (ప్ర) కైకా నిన్నిందఱు పిలుచుచున్న రాకున్నావు. ఏటికీ చూ ఖర్య మూరకరమ్ము.

లక్ష్మ—(స్వ) ఔరా! ఎంతసాహసిని యీమంథర! ఇదియంతయు దీనిపనియా ?

కైక—ఏమి పిలిచితిరి?

కౌసల్య—సోదరీ! కైకా! నామాటవాటింపుము. నీకరుణావలోకము నాపైఁ బ్రసరింపఁజేయుము. నీకొడుకునకుఁ బట్టముగట్టుము. వలదనను. రాము నరణ్యమునకుఁ బంపుటమాత్రము మానుమా? అయ్యో! వాఁడు నీకొడుకుగాఁడా? నీకొడుకునకంటె రామునిపై నీకాదరణము మెండని యెన్నిమాఱులో చెప్పుచుంటివే. ఇదియా యిందులకు నిదర్శనము? నన్ను నాసుతునిబాపి నీవేమి సౌఖ్యమనుభవింప నెంచియున్నావు? నీచేతులంటి వేఁడుకొందును. ఈయింతవిన్నప మాదరింపుము. జన్మమున్నంతవఱకు నీయనుగ్రహము మఱవను. కృతజ్ఞనైయుండెద. నను దాసిగా నేలికొమ్ము. నాకభయమిమ్ము. పుత్రభిక్షమిమ్ము.

## అనుబంధము 24

సుమి—చెలియా! ఈమాటమాత్రము జరుపుము.

## అనుబంధము 25

అయ్యో! నీవు నీయెత్తు ధనముపోసినను నీయింటికి రానిచెలి నిను జేతులంటి వేఁడుచున్నదే! ఏల నీకుఁ గరుణగలుగదు. దశరథుకుమారులలో నొకరి నీవరణ్యమునకుఁ బంపనేవలయునన్న నాకు లక్ష్మణ శత్రుఘ్ను లిద్దఱున్నారు. వారిలో నొకరిఁ బంపుము. వలదనను.

## అనుబంధము 26

కైక—రాజేంద్రా! నన్నిట్లారడిచేయుటకా పిలిచితివి!

దశ—హా! దైవమా! కైకా! కైకా!

కౌస—కైకేయీ! మఱియొక్కమాట. నీకుఁగరుణగలుగదు. రాము నరణ్యమునకుఁ బంపుము. భరతుఁడిందువచ్చువఱకు నిలుపునుపకారము చేయుము. నేఁడే పంపవలయునను నంతటి పగయేటికి?

## అనుబంధము 27

ఈ పుణ్యముగట్టికొమ్మ. కరుణింపుమా. కరుణింపకున్న విడువను. నీయానవిడువను.

(కాళ్లపైఁబడును).

దశ—కైకా! ఇదిమాత్ర మొనరింపుమా. స్వల్పకార్యము. నీవు రెండుగాకింకెన్ని వరము లైన నడుగుము. ఇచ్చెదను. దీనిమాత్ర మాచరింపుమా. నిను నమస్కరించి వేఁడుదు. (కాళ్లపైఁబడును).

కైక—(మంథరనుఁజూచును)

మంథ—(వలదని సైగచేయును),

కైక—రాజేంద్రా! సభ్యులారా! ఏమిసొగసుమాట లేయివి? భరతుఁడు వచ్చిన వాని లోఁబఱచుకొని నను జెడ్డఁజేసి దేశభ్రష్టగాఁ జేయనెంచితిరా? నను గాడిదెపాలు పోసి పెంచినారనుకొన్నారా. రాజేంద్రా! ఈవాయాళితనము లేటికి? ఇందఱి యెదుట నన్నారడిచేయుచున్నారా? వరము లీఁజాలననుము. తీఱినదిగదా?

## అనుబంధము 28

చం॥ భరతుఁడు వచ్చెనేని కడువంచన లోఁగొనివాని రామునిన్
ధరణికి నిల్ప నెంతిరె దాని నెఱుంగఁగఁజాలనే విధం
బరయని గోలనే యకట యంతటిమోసమె నాకు లేదె నా
గరికత నాదుతల్లి నను గాడిదెపాలిడి పెంచియున్నదే॥

అందఱు—హా! శ్రీహరీ!

లక్ష్మ—(ఖడ్గముపట్టి లోనికివచ్చి)

## అనుబంధము 29

సభ్యులారా! చూచితిరిగదా? ఇందలిధర్మముల మీరాలోచింపుఁడు. వరములనఁగా నెట్టివి? తనకు మేలుగాఁ గోరినవికదా? బ్రహ్మాదిదేవతలఁగూర్చి యెందఱు తపము లొనరింపరు? ఎందఱు వరములఁగోరరు. తమకిట్టి మేలు నిట్టిపదవి రావలయునని కోరిరిగాక పెఱవారికిట్టి దుఃఖముగల్గవలయునని వరములడిగిరే? కాఁబట్టి యీకైకేయి రాము నరణ్యమునకుఁ బంపఁగోరినది వరమే కాదు. దాని నీయ ధిపుఁడీయఁబనిలేదు. అది గాక, యీమెకు రెండువరములకుఁగదా స్వాతంత్ర్యము? రెండనుమాట నెపమున నీమె యెన్నివరముల వేఁడినదో విచారింపుఁడు. ఒకటి భరతునకుఁ బట్టాభిషేకము చేయుమని. దీనితోడనే రెండును దీఱె. ఇంతవఱకు రాముపట్టాభిషేకము నిశ్చితమై యుండినందున, దాని మానవలయునని యొకటియు, భరతునభిషిక్తుఁ జేయవలెనని మఱియొకటియునగుఁ గదా? ఇంక నీఁదగిన వర మెక్కడిది? కావున నెట్టివరమును ధరాధిపుఁడీయఁబనిలేదు. ఈ రెండవదియను వరమునకు నెన్నియున్నవో చూడుఁడు. తపసివృత్తిమై, పదునాల్గేండ్లు

అరణ్యమునకుండ రాముని నేఁడే పంపవలయునఁట. అరణ్యమునకు రాముఁబంపవలయు ననుటయొకటి, పదునాల్గేండ్లుండఁ బంపవలయుననుట యొండొకటి, తాపసివృత్తిగలిగి యుండవలయుననుట యింకొకటి, నేఁడే పంపవలయుననుట మఱియొకటి ఇట్లునాల్గువర ముల నడిగినది. వీనినన్నిటి నీరాజేంద్రుఁడివ్వవలయునను నిర్బంధమేమి? ఏవియెట్లిచ్చి నను, నేఁడే పంపుమని నిక్కచ్చి చేయుట యెట్లగు? భరతుఁడు వచ్చువఱకు నిలుపుమని యూమెను వేఁడుకో నేల? అవశ్యము నిలుపవచ్చును.

వసి—భళిరే లక్ష్మణా! నీవింతయొప్పిదముగ మాటలాడుదువే!

సుమం—ఈయుక్తి యొకరికినిఁ దోఁపదయ్యెఁగా?

రామ—మీరేల సంతోషించెదరు? వరములు కానీ కాకుండనీ. తల్లియడిగినది తండ్రి యిచ్చినాఁడు. నామేనఁబ్రాణములుండ నే నతని నసత్యవాదిఁజేయుదునా? ధర్మ సూక్ష్మవాదమున కేమివచ్చును. నేఁబోవ నేవలయు.

చం॥ వరములఁగోరెఁదల్లి జనవంద్యుఁడు తండ్రియొసంగెఁగానకే
నరుగఁగఁ దమ్మునిన్ గృపధరాధిపుఁజేయఁగ నాకుఁగీఱునే
వెరవునఁదండ్రిమాట నడపింపని పుత్రుఁడు పుత్రుఁడే గుణం
బరయని ధర్మసూక్ష్మముల నాడఁగనేల వృథావివాదముల్॥

లక్ష్మ—రామా! నీ కెంతటి యవివేకము? అశక్తునిభంగి నిట్లు మాటలాడనేల? నీవర ణ్యమునకుఁబోవ నేల! తండ్రిమాటజరుప నేల? తండ్రియఁట వాక్యమఁట? ఇట్టితండ్రి మాటయు జరుపవలయును? ఈతండ్రియే వసిష్ఠాదిసంయములును సుమంత్రాది మంత్రు లును, నిండిన యోడ్డోలగమున మొన్న నినుఁ బట్టాభిషిక్తుఁ జేసెదనని నీకు మాట యీలేదా? ఆమాట నెట్లు తప్పఁజాలువాఁడు? అది తప్పిన నసత్యము లేదఁట. ద్రోహకాంక్షచేసిన యొకభోగిని కెన్నితరములక్రిందటనో యెవ్వరు నెఱుఁగకుండ యిచ్చినయవివేకపుమాట తప్పిన సత్యభంగమఁట! ఎట్లును నీతని కసత్యపాపమే రానుండ నరణ్యమున కేలపోయెదవు? నీబంటు నే నుండ నీకేమికొఱఁత. ధనువు పట్టినిలిచిన నెవరడ్డము రాఁగలరు? సప్తసాగరములఁ గలఁచి వైవఁజాలనా? కులా చలముల ప్రక్కలింపఁజాలనా? రామా! ఈపురివిడిచి ముందొక్కడుఁగిడకుము. మదనాతురుఁడై, వృద్ధుఁడై, క్రూరకర్మములనోర్చిన యీదశరథు మాటలేల విన వలయు? నాచేతులార నీకు నేన పట్టాభిషేకము జేయఁగలను. ఈ కౌక్షేయకము పట్టినిలిచి భరతాదులగు శత్రువర్గములఁ బరిమార్చెద. ఏయసతీసుతుఁడడ్డము వచ్చె డినో చూతము. ఈదుర్జాతిమంథర కలదుగదా? దీనినిప్పుడే—(కత్తియెత్తిపోవును)

కౌసల్య—లక్ష్మణా! (అని నిలిపి) ఈ మంథర నిరపరాధి. నేనెఱుఁగుదును. దీనిఁ గనలకుము.

రామ—లక్ష్మణా! లక్ష్మణా! ఎంతమాటలాడితివి! ఎట్టిపాపముగట్టుకొంటివి! కోపమునఁ గలిగిన యనుతాపమున నరకకూపమునఁ బడిపోవుటరయ వైతివే.

ద్రుతవిలంబితము. తగునె నీతలిదండ్రుల నగ్రజున్
వగపు పుట్టఁగఁ బల్కితి విట్టులన్
మిగులనిన్ను సుమిత్రయె కాంచెనో
వగఁ గిరాతకబాలునె పెంచెనో॥

ఎవ్వరినింతగా నీవాడునది? దశరథునా? తండ్రియే. కైకనా? తల్లియే. భరతునా? అన్నయే. పితరులఁగుఱించియు నగ్రజుఁగూర్చియు నిట్లాడిన పాపమునకు నీ కెట్టిప్రాప్తి ఘటిల్లఁజాలదు! నీవు సుమిత్రకన్న వాఁడవని తోఁచదు. ఎందో శబర కిరాతకులంబున నుద్భవించి దుష్ప్రాప్తిచే నిన్ను సుమిత్ర పెంచినట్లుతోఁపఁ జేయుచున్నావు. నీతో సంభాషించిన దురితముగాదా?

తోటకము. తలిదండ్రుల నగ్రజుఁ దాలిమితో
కలయించెడు పాపము లాడితివే
బలుకోపము దెవ్వరిపైన నిఁక
న్దిలకింపఁగఁ బాపము నీముఖమున్॥

లక్ష్మ—(కత్తిపాఱవేసి) అన్నా! రక్షింపుము. కోపమున నరయలేనైతి. బ్రహ్మహత్యా పాతకమునకు గుఱియైతి. (కాళ్లఁబడును)

రాము—(లేవనెత్తి) ప్రియసోదరా! నీకు బుద్ధిగలుగుటకై క్రూరపుమాటలాడితిఁగాక, నీసుస్వభావము నెఱుఁగనా? నన్నేల క్షమింపవేఁడెదు? నిను క్షమింపవలసినవారు నీ పితరులుగదా?

## అనుబంధము 30

లక్ష్మ—జనకా! మహాశాంతగుణోపేతుఁడవగు నీకుఁబుత్రుఁడననిపించుకొని యొడలు దెలియకుండఁ గాల్చిన కోపమునకులోఁబడి నిన్నూరకదూఱితి. ప్రాయోపవేశ మొనర్చినను, నాపాపము నాకుఁదప్పదు. రక్షింపుము. (దశరథుకాళ్లపైఁబడును.)

దశ—తనయా! నీవేమంటివి? నీమాటలన్నియు యథార్థములు. నేఁగామాతురుఁడఁ గాననే యీకులనాశకరి కీదురాత్మురాలికి వరములిచ్చితి. క్రూరకర్ముఁడఁగాననే యింత

కోర్చితి నేనవశ్యము వధార్హుఁడ. నీచేతఁగానున్న వేఱొండు భంగినైనఁ జావఁగల వాఁడ. ఏల వెనుదీసెదవు? ఇదే నాకంఠము. ఇదే నీకరవాలము. (ఏడ్చుచు) నీకేమియుం బితృహత్యాఘపాపము కలుగకుండ దైవముం బ్రార్థించెద. కానిమ్ము

రాము—అయ్యో! ఇటుదగునా? వీఁడు ప్రజ్ఞలేమి నిట్లాడె నింతయు. అవశ్యము క్షంతవ్యుఁడు.

దశ—రామా! నేనుకోపమునఁ గార్పణ్యమున మాటలాడితినా ?

లక్ష్మ—జనకా! నీవు క్షమింపకున్న నీకరవాలమున నాజిహ్వ—(ఎత్తును).

దశ—(నిలిపి) పుత్రా! నీవొనర్చినది యపరాధమేయని నీవెంచిన క్షమించితి. నిక్కముగా క్షమించితి.

లక్ష్మ—మనసారఁ గరుణించినందునకు నిదర్శనముగా నాకొక్క వరము నీవలయు.

దశ—అయ్యో! నావరములు నన్నేగతికిఁ దెచ్చెఁ జూచియున్నాఁడవుగదా? అయినను బ్రియకుమారునకీఁదగిన వరమేది యడుగుము.

లక్ష్మ—శ్రీరాము వెంట నన్నుఁబోవ ననుజ్ఞయీవలయు. ఇదియే నావరము.

సుమి—కుమారా! లక్ష్మణా! నీవు నాతనూజుఁడవైనందులకు సార్థక మిప్పుడుగదా? సుకుమారుఁడగు రాముఁడు సుమకోమలాంగియగు సీతతో నరణ్యముల కేగుచుండ వారికి రక్షగా నీవుపోవ వేఁడవలయుననియే యుంటి. అది నీవకోరితివి.

రాము—లక్ష్మణా! ఇదియేమి కోరిక—

లక్ష్మ—నేను వెంటరా ననుగ్రహింపనే వలయు. (నమస్కరించును).

రాము—తమ్ముఁడా! లెమ్ము. నీవియ్యాదరపూర్వకముగ వెంటవత్తునన్న నేవలదందునా? నాకుఁ జతుర్భుజములు కావా నీవుండిన? జననీజనకులారా! ఇంక మాకాజ్ఞ యిండు. పుత్రుల స్వల్పవియోగము గలిగెనే యని వంతఁగుందకుఁడు. నారచీరలనిండు.

కైక—(మూఁడు జతల నారచీలు నొకజత దారుపాదుక లిచ్చును.) కుమారులారా! ఇదిగో చీరలు, కొనుఁడు.

సుమం—(స్వ) ఇట్టిపాపశాలి యిటి కఠినమానస లోకమున లేదుగా!

దశ—హా! హా! శ్రీహరీ!

వసి—కైకేయీ! చూచి, చూచి యోర్చితిమి. ఇంకెంత యోర్వఁగలము. ఆ కేకయ రాజునకీ వెట్టివేళ జనించితివి? నీదుష్కృతివలన ఫలమేమైన నున్నదని యెంచితివా? భరతునికై కదా నీవిట్టి కటికపనిచేసితివి? ఆభరతుఁడు నిన్నాదరించునని నమ్మితివా? నీవుగడించిన యీనీచసింహాసనమునఁ దన నామపాదమైన నాఁడూనునని యెంచి

లివా? ఆరథరతుఁడెవ్వఁడని యెంచితివి? వాఁడు శ్రీరాముని దశరథు ప్రతినిధిగాఁ జూచువాఁడు. అతని మాట నింతయైన మీఱనివాఁడు. తనయన్న కిట్టి పాటుగలిగెనన్న వెతఁ జెందకుండఁడా? వాఁడు దశరథునికొడుకే యైన నినుఁ దల్లిగా భావించునా? నీపాపపుమోము మరలఁ జూచునా? అయ్యో! ఈ సుకుమారులకు నారచీరలివ్వ నీ చేతులెట్లాడెను?

దశ—హా! కైకా! రామునికి నీవు తపసివేషము గోరితివిగాక, సీతకు లక్ష్మణునకుఁ గోరితివా? లోకవిదిత పాతివ్రత్యవిఖ్యాతియై, పుణ్యగుణోపేతయై, యనవరత సద్వ్రత సమేతయై, తగు సీతకా యిచ్చితివి నారచీరలు? తెమ్ము నామణిభూషణ సందోహము. ఇల్లాతయుం నూడ్చి తెమ్ము. సీతా! కోమలముఖకంజాతా! సుగుణవ్రాతా! కొమ్మీ భూషణములు. పాఱవేయుమా నారచీరల (తా నే పాఱవేయును).

లక్ష్మ—జనకా! నాకివియే యుండనిమ్ము.

రామ—తలిదండ్రులారా! మాకింక నాజ్ఞ నిండు. జనకా! ఈ కైకేయిమాతను మీరు నిరాదరణ మొనర్పరాదు నాకహితకార్య మీమె యేమియు నొనర్పలేదు. ఆయమ నొక్కింతయు నోనాడవలదని ప్రార్థించుచున్నాను. ఈ కౌసల్యాసుమిత్రాదేవులు పుత్రులు దగ్గర లేకుండుటఁ జేసి వగచుచుందురు. వారల చింత వారింపవలయు. తేఁపు భరతుఁడే తెంచిన మానందీవాదముల వచింపుము. రాజ్యము గైకొనుటకు వాఁడేమైన సంకోచించిన మదాశీఃపూర్వకముగ నేనొసంగెదననియుఁ బరిపాలింపవలయు ననియు వచింపుము. అమ్మలారా! మాజనకునిపై నించుకైనఁ బరాకు రిక తప్పకుండ వలయు. అతఁడు వృద్ధుఁడు. ఊరక నాకొఱకై చింతఁ బూనివాఁడు. మీభక్తిశ్రద్ధల నతని చింత నుడిపి పాలింపవలయు. భరతునిఁ గరుణింపవలయు. వాఁడు మీయెడలఁ బరమభక్తిపరుఁడు. మా మాటగ మీ వశమునందుండువాఁడు. ఇంక నానతిండు.

దశ—రామా! అట్లయినం బోయెదవా? ఇదియే నీకడచూపని నాకుఁ దోఁచుచున్నది.

రామ—జనకా! ఆమాట లనకుము. మమ్మాశీర్వదించి శుభముగఁ బంపుము. కన్నీరు నింపకుము. ఇదె నమస్కరించువారము (సీతారామలక్ష్మణులు నమస్కరింతురు)

దశ—పుత్రా! అయినఁ బోయెదవా? నాయత్నము లేదు.

సీ॥ కులశేఖరుని నిన్ను ఘోరాటవులకు నేఁ
డనిపితి నని యన్నుఁ గనలకన్న
కైక పాపముగాక గలుగదు నాపాప
మించుకంతయు నంచు నెంచవన్న

మా॥ ఆఁ జాలమిఁ జేసి మితిమీఱి కలిగెనీ
యుమ్మలమని నీవు నమ్మవన్న
సడలించు శోకంబు సాక్షి చాలకయున్న
నేఁజచ్చినప్పుడైన నెఱుఁగవన్న
తే॥గీ॥ మగువ నీసీత వనుల నేమాఱకన్న
పిన్నతమ్ముని఼ఁ గరుణఁ జేఁ బెంపవన్న
మాతలను నన్నుఁ దమ్ముల మఱవకన్న
భూరియశమున మఱిపురిఁ జేరవన్న॥

కైకేయిక్రూరత్వ ప్రభావమున గుణభూషణుఁడవగు నిను ఘోరారణ్యముల పాలు చేసితిఁగా యని నన్నుఁ గనలకుము. ప్రాప్తము నెవరు దప్పింపఁజాలుదురు? కటకటా! హంసతూలిక పాన్పుపై పరుండినను గందు నా యీ లేమేను గులకరాళ్లపై నెట్లుండునో? ఎండకన్నెఱుఁగక సౌధములందుండినను గసిగందు మోమిది యీ వర్షాతపముల కెట్లోర్చునో? మెత్తని చిత్రాసనములఁ ద్రొక్కెడు క్రొన్నెత్తురుబ్బు పదము లరణ్యకంటక శిలా ప్రదేశముల నెట్లు సంచరించునో? నేనేమి యేమి ప్రయోజనము? ఈ సీతాలక్ష్మణులు నీపై మోహమునఁ జాయక చనుదెంచెదరు. వీరిఁ జక్కఁగా నరసికొనుము. ఈ సీత సుకుమారి. ఆకాంక్షవుల నెట్లు వర్తింపఁగలవో? అలయకుండఁగాఁ గాపాడవలయునుమా. సీతా! నీపతి వెంటఁబోవు పాతివ్రత్యమునకు మెచ్చితి. మీరుపోవు విపినంబుల భీకరమృగములును, రాక్షసుల నెలవులు నుండఁగలవు. నిర్భయముగాఁ దిరుగాడకుమా. వీరిరువురిలో నొకరు వెంటరాక యెందును బోకుము.

పృథ్వీవృత్తము.

పురాకృతము తప్పునే పొగులకమ్మ నీకైనయీ
కరాళగతికిన్మమున్గనలకమ్మ యెందైననా
యరణ్యములనొంటిగా నరుగకమ్మ నిర్భీతిగా
మరాళగమనా మమున్మఱవకమ్మ యోకోడలా॥

కుమారీ! పోయిరమ్ము.

మంథ—(కైకతో) ఇంకకునను పోవమురమ్ము. అప్పుడే నీవేమ్మొగము పెట్టితివి. ఏమిచేయుదువో—

(రామ, సీత, లక్ష్మణ—కౌసల్యకు నమస్కరింతురు)

కౌస — రామా! ధీరమానసమున నంతయుఁ బర్యాలోచించి చూచియున్నాను. అన్నా! పోయిరమ్ము. ఈలక్ష్మణుని సీతను నేమఱకుము. వీరినరయు నెడ నెంతశ్రద్ధ యున్నను దక్కువే యగు. (రాముని తల నివిరి యాలింగనము చేసి) రామచంద్రా! దేవతలు, ఖేచరులు, దిక్పాలకులు, చంద్రుఁడు, సూర్యుఁడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, పృథివ్యాదిపంచభూతములు, శ్రుతులు, శాంతిదాంతులు, యతులు, నదులు, తరులు, గిరులు, దశదిశలు, సమస్త జీవరాసులు, సప్తాధోలోకముల సప్తోర్ధ్వలోకములనున్న ప్రాణిసందోహము నిన్నెప్పుడు క్షేమముగలిగింతురుగాక! (చేతికి రక్షగట్టి), రామా! దీని బాయక రక్షించుకొనుము. అలనాఁడు తనతల్లి దాస్యముఁ దీర్ప నుద్దేశించి సర్వప్రయత్నముల దేవతలజయించి దేవలోకమునుండి యమృతముఁ దెచ్చుట కుద్యమించి మ్రొక్కి యెదుటనిలిచిన గరుత్మంతున కాతని తల్లి యెట్టిదీవనలొసంగెనో యాదీవనలునీకుఁగలుగనిమ్ము. అజేయుఁడై సర్వాయుధాభేద్యుఁడై సురలఁబాఱఁదోలి సురపురి నాక్రమించియున్న వృత్రాసురుఁజంపు నుపాయము గానక తొల్లి దేవేంద్రుఁడు విష్ణువలన ననుజ్ఞవడసి సర్వసామగ్రుల సమకూర్చికొని ఋషిప్రముఖులగు దేవతలకు మ్రొక్కి నిలిచి వృత్రుపైఁ బోవుట కనుజ్ఞవేఁడఁగా, నాదేవతలాతని కేమంగళముల నిచ్చిరో యామంగళములు నీకుఁ గానిమ్ము. మఱి బలిదానవనేత దేవేంద్రుని స్వర్గమపహరించి యలఘులీలఁ బాలింపుచుండ, నింద్రుని స్వత్వమింద్రునకుఁ జేర్చునుద్దేశమున జనించిన వామనమూర్తి బలీంద్రు ధరాదాన మడుగఁగోరి యటకుం బోవ నాతని వేఁడి తనతల్లి యదితికి మ్రొక్కి నిలువఁగా రాజ్యభ్రష్టులై కడుహీనస్థితినున్న యింద్రాదిసుతులఁ గాపాడికొనుచు గహనాంతరసీమల నిరుపేదభంగిఁ గాపురమున్న యాయదితి యా వామనున కెట్టి విజయములఁ గోరెనో యావిజయములు నీకుండనిమ్ము. తనూజా! పోయిరమ్ము. లక్ష్మణా!

శా॥ అన్నాలక్ష్మణ నిష్ఠురాటవుల నాహా యెట్లు కాపాడఁగా
నున్నావో రఘురాముఁగోడలిని నిత్యోత్పాతముల్మాన్పిసీ
వున్నావంచుఁదలంపనూఱటయు నాకొక్కింతచూపట్టెనా
కన్నుల్చల్లనగా వధూతనయభిక్షంబిచ్చి మన్నింపవే॥

నీవు రాముని వెంట నేగెదవను కారణమునఁగదా యింత ధైర్యము వహించి యున్నాను. నీయన్నను వదినియను నిష్ఠురాటవుల బాధలొందనీక మరలఁ బురముఁ జేర్చితివా నాకునీవ పుత్త్రపుత్త్రీదానమిచ్చిన వాఁడవగుదుసుమా. సీతా! ధరణీజాతా!

సీ॥ మితభాషణములాడు సతివవౌటనుసొంపు
నింపునీమాటలాలింప నైతి
మిగులఁజూచిన దృష్టితగులునోయనుభీతిఁ
గన్నులారఁగనిన్ను గాంచనైతి
చిఱుతసిగ్గున నీవు చేర రాకుండుట
నింపుగా నినుఁగౌఁగిలింపనైతి
సుతనుమించినకూర్మి నతివ యోకోడలా
కడఁగినీశుశ్రూషఁగాననైతి
తే. గీ॥ బాల నినునేఁడు గానలఁ దోలుటాయె
నెటుల వేఁగింతునమ్మ త్రోయింతునమ్మ
వంతఁజాలింతునమ్మ తలంతునమ్మ
యెంతునమ్మ ప్రాణముల భరింతునమ్మ॥

చక్రవర్తికుమారుఁడనియుఁ, జక్రవర్తిపదమునకు రాఁగలవాఁడనియు, నమ్మి జనకుఁడు నిను మా రామునకిచ్చెను. ఎల్లప్పుడు నిను గారాముగాఁజూచిన మిథిలానాథుఁడు నిన్నుఱచేత నిడుకొని కాపాడి తనయిట్టివారిఁగా భావించి నినుమాకోడలిఁ జేసెను. అట్టి నిన్ను గట్టులఁబట్టించి జనకరాజున కెంతయు నపరాధమొనర్చితిమి. ఇప్పుడతనిమానసమెట్లుండఁగలదో. విధిబలముచేనైనయీకార్యమునకు మమ్ముఁగనలకుమా! నిన్నుబొమ్మనఁజాలము. పోవలదనఁజాలము. పరమసుస్వభావమునను, సముచిత సాధ్వీగుణంబునను, ధీరపతివ్రతవై నీపతివెంటఁ గానల కేగుటయే విహితము, సముదంచిత సతీగుణ సముపేతయగు నిట్టికోడలు మాదండనుండుటకు నోఁచనైతిమి. మాసంతాప మాదైవమేయెఱుఁగు. ఎట్లును బోవనున్నావు. పోవఁగలవు-పోయెదవు. ఎట్లయినఁ జింతమాన యత్నింపము! పతివ్రతాతిలకమవగు నీకు నేఁ జెప్పవలసిన ధర్మములేమున్నవి? జనకుండు నిన్ను మావశము చేసినదికల్ల. వా యిరువురు ముద్దుకుమారుల నీవశమిప్పుడు నేఁ జేయుటయథార్థము. వీరలనెట్లరసెదవో. వేళ వేళకు భోజనమిడి వలసిన యుపచారములఁజేసి యెట్లు రక్షించెదవో, పూజనీయురాలవై మరల సౌఖ్యముగ నీపతితో మఱఁదితో మాయింటికరుదెంచి నాయాశీర్వాదము నెట్లు వడసెదవో. సీతా! మిథిలాపురినుండి తెచ్చితివే. ముద్దుచిలుకల వానినెందుంచి పోయెదవు? నీయాకలిరైనమాని వానినిఁ బోషింపుచు వచ్చితివే. అరణ్యముల రామలక్ష్మణుల నట్టిచిలుక లేయనియెంచుమా! అమ్మరో! పొమ్ము. ఈపదునాల్గేండ్లుమమ్ముమఱవకుము. అక్కటా! కాదు మఱచిపొమ్ము. (ఏడ్చును).

దశ—హా! నిర్భరము. సతీమణులారా! మీరందఱుఁ బయనముకండు. సుమంత్రా! పురివారినెల్ల నరణ్యమునకుఁ బ్రయాణము గమ్మనుము. చతురంగబలములతో సర్వ సంపదలతో నేనుం బోయెద. ఈపాదుకాదు భరతుఁడే యేలెడుఁగాక. ఈవిధవయు—

కైక—

మ॥ ధరణీపాలక సేవకంబడుగ సాంద్రఖ్యాతిఁ బాదూరికిన్
భరతున్ బట్టము గట్టవిచ్చితివె నీపాండిత్య మింపాయెనా
వరమీలేదనుమింతయేల సుతుతో బల్కానకున్ బోయెదన్
ఇరవారంగ సుఖంబుగా మనుఁడు నీయిల్లాండ్రుమీరందఱున్॥

రాజేంద్రా! పాదుకా నీవు భరతునిఁ బట్టముగట్ట వరమిచ్చినది? వరము తే యివ్వనుము. నీయాండ్రతో నీవే సుఖముండుము.

దశ—హా! దైవమా!

రామ—జనకా! ఈమాటలేల! సుమిత్రాదేవి! మాకు సెలవా?

(రాము-లక్ష్మ-సీత నమస్కరింతురు).

సుమి—తనూజులారా! కోడలా! నే నేమి వచింపఁగలను? అన్నా! లక్ష్మణా!

తే॥ గీ॥ తనక దశరథుఁగా రాముఁదలఁపవన్న
ఎలమి సీత మాయమ్మగ యంచెంచవన్న
ఆయరణ్య మయోధ్యఁగా నరయువన్న
సుఖము దీపింప మతినన్నుఁ జూడవన్న॥

పతివ్రతాతిలకమై శాపానుగ్రహ సామర్థ్యవిరాజితయై యొప్పు కౌసల్యాదేవి మంగళశాసనములుండ మీకేమికొఱఁత.

రామ—కైకేయిమాతా! నీవు మమ్మాశీర్వదింపుము,

దశ—హా! హా! వలదు. పలదు ఇంత యాశీర్వాదమే చాలదా?

కైక—వరములిచ్చువారిం గంటిమి. ఇంత యేచ్చువారిఁజూడము. (నిష్క్రా))

అనుబంధము 31

రామ—వసిష్ఠసంయమీంద్రా! మాకనుజ్ఞయా? (రామ,లక్ష్మణసీత నమస్కరింతురు)

వసి—రామా! నిన్ను నే నేమాశీర్వదింపఁ గలను? నీవెందున్న నదియే పరమస్థానము. దుష్టనిగ్రహమును, శిష్టానుగ్రహమును, నిర్జరామోద విభూతియుఁ శాత్రవపఙ్క్తికంధర హరణ విఖ్యాతియు, నీకు సిద్ధించుఁగాక.—

రామ—సుమంత్రా! ఇంకఁ బోవమురమ్ము. (రామ-లక్ష్మ-సీత-సుమంత్ర నిష్క్రా))

దశరథ<br>కౌసల్య<br>సుమిత్ర } హా! మాభాగధేయము, మా జీవరత్నము పోయె. (మూర్ఛిల్లుదురు)

[ ప్రవేశము: పౌరులు—(ఆయుధ-పౌరక మొదలైనవానితో-విధవయు]

## అనుబంధము 32

పౌరులు—ఆదుర్జాతి కైకయేది? ఆపలుగాకి మంథరముండ యెక్కడ? ఆ యవివేకి దశరథుఁడేఁడి?

కౌస—పౌరులారా! ఏమి యిట్లువచ్చితిరి?

పౌరు—ఆ మంథర, వినవయేది? పలుగాకి కైకయేది? అడచెదము. పొడిచెదము. తాఁతఁ గొట్టెదము. గుండువేసెదము. పౌరకతోఁ గొట్టెదము.

దశ—పౌరులారా! ఆఘోరపాపుఁడ నిందే యున్నాను.

పౌర—మొత్తు-తన్ను-కొట్టు-చంపు.

1. పౌర—ఈరాజు నేమిచేసి యేమిప్రయోజనము? వరములిచ్చి మిడుకుచున్నాఁడు. కైకను మంథరను బట్టుదము.

2. పౌర—ఏరీ! ఎకీ! వెదకుదము. పట్టుదము. నఱుకుదము.

1. పౌర—ఓకీ! ఈఁదలోనికిఁబోయి తల్పులు వేసికొనియున్నారు.

పౌరు—వాకిళ్లుపగులఁగొట్టుఁడు. గోడలుపడఁద్రోయుఁడు. (కలకలము చేయుదురు)

1. పౌర—రావురా యీవాకిళ్లు?

2. పౌర—ఆయింటికట్లనే యగ్గిపెట్టుఁడు. దగ్ధమైపోవనీ.

1. పౌర—ఇంటిలో నగ్నియెందున్నదో వెదకుఁడు. వెదకుఁడు.

కౌస—పౌరులారా! ఇట్టియరాజకమా? దండించువారెవరులేరా?

పౌర—రాముఁడు పోయినపిదప మాకు రాజెవ్వఁడు. మాటలాడకుడు. చిక్కినవారిఁ జంపుదము. చావఁగొట్టుదుము.

1. పౌర—కొట్టుఁడు. కొట్టుఁడు ఎవ్వతెయైననేమి? ఎవ్వరైననేమి?

పునః ప్రవేశము: లక్ష్మణుఁడు—(శీఘ్రముగ.)

లక్ష్మ—పౌరులారా! ఇందేమి చేయుచున్నారు?

పౌరు—ఇదిగో! యగ్ని-ఈయింటికగ్గిపెట్టుచున్నాము.

లక్ష్మ—పొండిక్కడనుండి. ఇంతయాజ్ఞ లేనివారుందురా?
పౌరు—వీఁడేమిరా! మాడలాడుచున్నాఁడు కొట్టుఁడు కొట్టుఁడు.
లక్ష్మ—దురాత్ములా! చచ్చితిరి. (ఒల్లెక్క పెట్టును).

[పునః ప్రః (శీఘ్రముగ) రాముఁడు ]

రాము—లక్ష్మణా! ఈవిల్లేటికి? పౌరులారా!
పౌర—ఓరీ! రామచంద్రుఁడు మాటలాడుచున్నాఁడురా! వినుండు. వినుండు.
(నమస్కరింతురు.)
రాము—ఏమి సేయుచున్నారు రిందు?
పౌర—కైకను మంధరను గాల్పఁబోవుచున్నాము.
రాము—ఇట్టి మాతృద్రోహులుగలరా! ఊరకపొండు. రాజుభార్య మీకుఁదల్లిగాదా?
2. పౌర—తల్లియైనను మానము. తండ్రియైనను మానము.
1. పౌర—రామచంద్రునితోనా యిట్టిమాట లూరకుండుము.
రాము—పౌరులారా! మీకు నమస్కరించెదను.

అనుబంధము 33

పౌర—అయ్యో! అయ్యో! (నమస్కరించి నిష్క్రమింతురు)
రాము—లక్ష్మణా! ఇక్కడనుండియే పోవుదము. అందుఁబోయిన మాయయ్య యున్నాఁడాలస్యమగును.
రామ—(రథముపైనఁ గూర్చుండి) సుమంత్రా! ఇదె మాయయ్య వెనువడి వచ్చుచున్నాఁడు. రథము వేగముగఁబోనిమ్ము. (నిష్క్ర))
దశ—(వెంబడించుచు-కౌసల్యతో సుమిత్రతో).

కం॥ కలుషంబె కాని యనృతమె
బలియని నరకంబె కాని వరములనీయక్
పలవించిపిల్చు జనకుని
యులు కారఁగనింత తిరిగిచూయనియనవే॥ 1

సుమంత్రా! సుమంత్రా! రథమునిల్పుము. సుమంత్రా! (గట్టిగనరచి) అయ్యో రథముపోయె. ఏపుణ్యాత్ములైన దాని నిలుపరే. మారాముని నాకిచ్చువారు లేరే. ఈసుమంత్రుఁడెట్టి దురాత్ముఁడు! ఎంత వేగముఁదోలుచున్నాఁడు. రథపుటెక్కెమైనఁగనఁబడదే! అయ్యో! ధూళియైనఁగానరాలేదే! రామా! రామా!

అనుబంధము 34

(మూర్ఛిల్లును.)

కౌస, సుమి—హా! నాథా! (శిశిరోపచారములు చేయుదురు)

దశ—కౌసల్యా! రాముఁడుపోయెఁగా? పోయెఁగా మారాముఁడు?

కౌస—ఈవీధినేమి యీదుఃఖము పోదనురమ్మ.

దశ—ఎక్కడికి?

కౌస—అదియేగదా కైకయిల్లు?

దశ—కైక! కైక! ఎవ్వరా కైక?

కౌస—హా! దైవమా?

దశ—కైకగదా? తెలిసెను. దానిభవనము కలుషమూలకందము. నీయింటికిఁ బిలుచుకొనిపొమ్ము. (యవనిక పడును)

ద్వితీయాఙ్కము-సమాప్తము.





# పాదుకాపట్టాభిషేకము.

## తృతీయాఙ్కము.

### ప్రథమరంగము- కైకేయి నగరు.

[ ప్రవేశము: మంథర ]

మంథ—అబ్బ! ఇప్పటికి నిక్కువముగాఁ జావుదప్పెను. నేనేమిచేసియున్నాను? ఎవ్వరొకట్టరు నన్నిట్లేల తిట్టవలయు? వారేమన్ననమ్మిన కౌసల్యయుండకున్న, లక్ష్మణుఁడు చంపునుండేనేమో? వారు మూఁడుదుర్మార్గులో యింటికగ్ని పెట్టవచ్చిరి. ఈవిధవాసుతులందఱు రామునివెంటఁ బాడయిపోయివారని తెలియువఱకు నేనుఁ గైకయు వెలికి రామైతిమి. ఏమయిననేమి? కార్యమేమో ముగిసెఁగదా! ఇంకెందుండిన నపాయము. గిరివ్రజపురమునకుఁబోయెదను. పోవుదమా వలదాయని యోచించుచున్నాను. పాలుద్రాగుదునా? పాయసముభుజింతునా? ఇప్పుడె వెడలిపోయిన నిక్కడ మంటరేమో పెట్టినట్లాయెను. పాలుద్రావినయట్లేగును. ఇందేయుండి భరతుఁడురాజ్యమేలఁగాఁ గైకకుమాఱుగ సర్వాధికారములు జరుపుచు నన్నుఁదిట్టుదు వచ్చిన యీమూరి వారిపైఁగసియంతయుఁదీఱ నీవిధవలనువిధవాసుతులను బాధించి పీడించి వేధించితినా, పాయసముదిన్నట్లగును. పాలకంటెఁ బాయసమే మేలుగదా? అయిన భరతుఁడేమైనఁ గైకపై విరోధముఁబూనెనా యప్పుడు పాయసముగాదు విషముద్రాగినట్లగును. దీనికేమిచేయఁగలయు? అట్లేలగును? భరతుఁడేమి మనుష్యుఁడుకాఁడా? మొదటనొకవేళ సంకటముగలిగినను, వేకచ్ఛత్రాధిపత్యముగాఁ జక్రవర్తిపదముగలిగినందులకు సంతసింపకపోవునా? సంతసించినపుడిట్టిభాగ్యముఁ దనకుఁగలిగినందులకుఁ గైకనుమెచ్చకుండునా? మెచ్చినపుడాకైక యీవసుంధరాసతీమణియు పాయామే నన్నిట్టి సుస్థితికిఁదెచ్చెనని చెప్పకపోవునా? అప్పుడు నేనెట్టిదాననగుదు! భళిభళి! ఈలోకమున నెవ్వరుపొందని యుచ్చాయపదవి నాకుఁ గలుగుఁగా: భరతుఁడెట్టి రాజకార్యమైనను నాతోనాలోచింపక చేయునా? భరతుఁడేల నేగదా రాజ్యమేలుదానను? అదిగాక భరతునిపై నాకిప్పుడు—ఏదో మోహ మందురుగదా? అదిపుట్టియున్నది-పాంచులువిను ముండ

లిచ్చుట నెవ్వరులేరే- పుట్టియున్నది. నాయభీష్టమునకు భరతునివలన సముత్తరము గలిగినను గలుగవచ్చు. రూపమునఁ గాకుండినను, బుద్ధినైన మోహింపఁడా? నేనించుక వయసుచెల్లినదానను నిజమే. అయిన నేమి? ఏపుట్ట నెంతపాముండుటయు నెవ్వరెఱుంగుదురు? కావుననే వానికిసంతోషోదంతమునప్పుడే జాబువ్రాసి తెలియఁజేసియున్నాను. నాయోచనా విశేషమువలనఁ దనకీ సౌఖ్యముగలుగ నున్నదని తెలియఁజేసినాను. నాయభీష్ట మొకటి నెఱవేఱినా యింకేమున్నది? భళిరే! ఏదో యింతా యూపము గానున్నదని నేఁజెప్ప, మాండవియొక్క చరణమును గైకమతి యొక్క చరణమును, నొత్తుచుండ భరతచక్రవర్తియగుగడుగునకు ‘‘దేవికెట్లున్నదని’’ విచారించుచుండ నాభాగ్యమెంత రాణించును! కాని! ఊరక యుందుచుందే నేం తెమ్మకోరిక లెందులకు? జరిగినప్పుడుగదా యనుకొనవలయును? జరిగినప్పుడుగదా ఫలము? ఏలజరుగదు? నేనెంచినంతకంటె నెక్కువగా జరుగును. నాకుఁగలిగెడు కొడుకేభావిచక్రవర్తి కాకుండునా? అదిగో! కైకవచ్చుచున్నది. మగనియొద్దకు సవతియింటికిఁ బోయియుండె. అదియేమి మిట్టిమోమున వచ్చుచున్నది? రేవునకుఁ బోవుదానివలె నున్నదే?

[ ప్ర: కైక—(దుఃఖముతో)]

కైక—మంధరా! ఎంతపాపాత్మురాలవే! నీమాటవిని యెట్టికలి తెచ్చుకొంటిని!

అనుబంధము 35

నానాథునికిఁ బిచ్చిపట్టియున్నది. కలువరించుఁగాని మనుష్యులపైఁ బ్రజ్ఞలేదు. ఈ ప్రజ్ఞలేనివేళ నయితము కైకవచ్చినదన్నఁ బెడమొగము చేసి నను జూడఁడాయె. అయ్యో! ఆముఖమునందలి శుష్కభావము చూడ నతఁడు జీవించునట్లులేదు.

మంథ—కైకా! దైవము నీకేమినో బాధించుచున్నాఁడే ‘‘మగఁడుచచ్చును. మగఁడు చచ్చు’’నని మొత్తుకొనుచున్నావు. పెద్దకొమారుఁడు పదునాలుగేండ్లవఱకు రాని యూరికిఁ బోయియుండ శుష్కభావముండదా? నేఁడు శుష్కభావముగానుండిన రేపు సగము శుష్కము. మఱునాఁడు పాదశుష్కము. నాలవనాఁడు ఆర్ద్రమగును. ఎన్ని దినములుండఁగలదు.

కైక—మంధరా! అంతయే కాదా? ఏమియుభయము లేదుగదా?

మంథ—భయమేమున్నదే? అదియుండనీ, నీకొడుకు చక్రవర్తి యయినంతనె నన్ను మఱువవు కదా?

కైక—అదియుండనీ, మంథరా! రాముఁడెట్టి మహాధీరుఁడే! చంపవచ్చిన లక్ష్మణునకు బుద్ధిచెప్పెను. ఎవరివలను మరలని పౌరుల మరలించి మముఁదప్పించెను. ఇట్టి వానికెట్టి యపకారమెంచితి!

మంథ—కైకా! నీవు పాముఁద్రావ నేరవుగదే. దీనినంతయు నమ్మితివా? రాముఁడు, లక్ష్మణుఁడు, కౌసల్య, పురజనులు, మాటలాడుకొని నీయెదుట నిట్టినాటకమాడి రాముఁడింత సంభావితుండనుగా ననినమ్మి నీవుకరుణింపఁజేసిన కుహకముగదా?

కైక—మంథరా! అట్లనా? అంతయేయుండునా?

మంథ—అంత గాకింకెంత? లక్ష్మణుఁడు దశరథుని దిట్టువాఁడా? తిట్టెఁబో, అంత కోపము, అంతధర్మశాస్త్రవాదము గలవాఁడు, రామునిమాటనే చచ్చినట్లూరకుండుట స్వభావోక్తియగునా? దశరథుఁడు చెప్పినను, కౌసల్యబెదరించినను, లక్ష్మణుఁడుధనువెత్తినను, మానని పౌరులు రాముని యొక్కమాటకే, కుదురుకొనుట స్వభావోక్తియా? రాముఁడంతయే మొనర్చియున్నాఁడు? ఈయతిశయోక్తివలననే సంవిధాన మేర్పడుఁగదా? అదిగాక రథమునెక్కి పోయిన రామలక్ష్మణులుమరల నెట్లు వచ్చిరి?

కైక—మంథరా! ఇప్పుడొప్పితిని. నీవెంత గుఱుతించినావే! ఎంతయుపాయమే!

మంథ—నాయుపాయమిప్పుడేమి? భరతుఁడు రాజ్యమేలునప్పుడు కనుగొందువు.

కైక—భరతుఁడన్న జ్ఞాపకముగలిగె. వసిష్ఠుఁడేమేయిట్లాడెను? భరతుఁడు రాజ్యమొల్లఁడఁట. నాముఖమునైనఁజూడఁడఁట. ఇట్లగునా?

మంథ—త్రోఁగొంచెమట్లనే జరుగవచ్చును. “తల్లి క్రూరకృత్యమున రాజ్యముసంపాదించినంతనే కొంకులేక రాజ్యమేలెనుఁగా భరతుఁడు” అని జనులందరను భయమున నట్లేచేయవలయుం. నానాఁటనదియే చక్కఁబడును.

కైక—ఎట్టియుక్తియున్నదే నీమాటల? నీవు నాకుఁజెల్లెలవు. (కౌఁగిలించును.)

మంథ—చెల్లెలనుము- కోడలనుము. దయమాత్రముండనిమ్ము.

కైక—మంథరా! మఱియొకమాట. కౌసల్యకేటికే నీపైనభిమానము నీవు నిర్దోషివనెను.

మంథ—అందునను మోసమే. నీవు నాస్వాధీనమనియెంచినన్నుస్తోత్రముచేసిన నేనుబ్బి తనకు మేలొనర్పవలెననియుక్తి. ఇట్టియుండఁగల నేనెందఱినో చూచినాను. ముందు యోచనలు మిక్కిలిగానున్నవి. పోదమురమ్ము. (నిష్క్రాన్తి)

## తృతీయాఙ్కము-ద్వితీయరంగము.

### కౌసల్యయిల్లు

[ప్ర: దశరథుఁడు(పండుకొని) సుమిత్ర, కౌసల్య వసిష్ఠుఁడు (ప్రక్కన).

వసి—నేఁడు కొంచెము గుణము గానున్నదా?

దశ—ఏడుదినములైనదా నేనిద్రించి?

వసి—రాజచంద్రా! ఈ యేడుదినములనుండి నీకు శరీరముపై నించుకైన స్మరణయుండ లేదు. నేఁడు తెలివిగలిగినందులకు సంతసించితి.

దశ—సంయమీంద్రా! ఇంకేటిసంతోషము? మనసున దావాగ్ని పుట్టియున్నది. దహించుచున్నది. పాపాత్ముఁడనైనందున నా తెలివిలేని సమయమునఁ జావనైతి. క్రొత్తక్రొత్తగాఁ దెబ్బలు తెబ్బతై యుప్పతించు దుఃఖమున మరల మరలఁ గుళ్లికుళ్లి మృతిఁజెందఁగదా యీ తెలివి వచ్చె.

వసి—రాజేంద్రా! చింతింపకుము యోచనీయములైన విషయము లనేకములున్నవి. రాముఁడరణ్యమునకుఁ బోయినరాత్రియే నీకు మతిదప్పె. నీసమ్మతి పడయక యేకార్యము చేయుటకులేక యూరకున్నాను.

దశ—హా! ఋషివర్యా! నీవలన నెట్టిమాటవింటిని! రాముఁడరణ్యమునకుఁ బోయెనా? నేనమ్మను. పొఱపడితిరి ఇందే యూరనుండవలయు. విచారింపుఁడు.

వసి—అయ్యో! యేమిచేయవచ్చును?

దశ—అదిగో! రాముఁడిక్కడకేవచ్చెను. రామా! చూడుమా! నిన్నందఱు నరణ్యమునకుఁ బోయినాఁడందురు. ఇటురమ్ము. ఏలదూరముపోయెదవు? ఇంకేలయోచన? వరములడిగిన కైక మృతిఁబొందె. ఇంకేమటంకము. పట్టముగట్టికొమ్ము.

| | |
|---|---|
| వసి-కౌస<br>సుమిత్ర | హా! మరలఁ గలిగెనే మతివిభ్రమము. |

దశ—మతివిభ్రమము! నాకెక్కడిదే మతివిభ్రమము? కైకచచ్చుట యబద్ధమా! రామా! నీవైన వీరికిఁ జెప్పుము.

వసి—హా! శ్రీహరీ!

దశ—శ్రీహరీ! శ్రీహరీ? ఏమి శ్రీహరీ? రామా! చూడుమా వీరెల్ల "శ్రీహరీ" యనుచున్నారు. కౌసల్యా! కైకేయిశవము దహింపఁబడెనా?

వసి—ఇప్పుడు తొందరపెట్టకుఁడు. తర్వాత కార్యాలోచన చేయుఁదము.

దశ—కార్యాలోచనములు? కార్యాలోచనము లేమి? రామునకుఁ బట్టముగట్టుటకంటెఁ గార్యమేమి? రామా! పోయిస్నానముచేసిరమ్ము. ఆవారచీరలు విడుపుము. (మెల్లఁగా పొమ్ము-పొమ్ము—(నిద్రించును)

వసి—రాజేంద్రా!

దశ—(ఊరకుండును)

వసి—కొంచెము నిద్రపట్టియున్నది. తెలివిగలిగిన పిదప నడుగుఁడు మీరెవ్వరైన భరతుని బిలిపింపవలయునా వలదాయని. ఇక్కడి కార్యములొక్కటియు వానికిఁ దెలియకున్నవి. అడుగక జాబెట్లువ్రాయుదు?

దశ—(ఊరకుండును).

వసి—ఏమఱకీశనిఁ గాచియుండుఁడు. నేఁబోయివత్తును.

దశ—(లేచి) ఆచార్యా! ఏటికిఁ బోయెద విందురమ్ము.

వసి—ఏల రావలయు? నీవుచక్కఁగ మాటలాడుచున్నఁగదా?

దశ—మాటలాడ కేమి?

వసి—ఊరక కలవరించుచున్నావే.

దశ—అయ్యో! ఈదింతాగ్ని కాల్ప నిద్రయే లేదే? కలవరమెక్కడిది?

వసి—ఒకమాటడిగెదను. సరియైన యుత్తరమిచ్చిన వచ్చెదను. భరతుఁడెందున్నాఁడు?

దశ—గిరివ్రజపురమున. ఇదేలడిగెదవు ?

వసి—అయిన వచ్చెదను. (కూర్చుండి) భరతు నిటకురమ్మని జాబువ్రాయుఁగోరి నిన్న డుగ వచ్చితి. ఏముత్తర మిచ్చెదవు ?

దశ—అయ్యో! వలదుదుడుగుమా! ఆదుష్కర్ముని మోమే చూడను.

వసి—అయ్యో! దశరథా! వాఁడొక్కపాపము నెఱుఁగఁడే. ఇట్లేల?

దశ—వాఁడెట్టి వాఁడైననేమి? ఎన్నితపములో యెన్ని యజ్ఞములోచేసి లోకైకవీరుడగు కుమారుఁ బడసితి నే. అట్టివాని నను(బాపె నే. బాలఘాతుకియే కిరాతక సంజాతయే, యట్టికైక కన్నవాని ముఖముఁజూతునా? చూచినప్పుడే నాప్రాణములఁబాసెద.

కౌస—నాథా! అయినదయినది. ఈకార్పణ్యమున నేమిప్రయోజనము? మనదుష్కాలమునకుఁ గైక కట్టిబుద్ధిపుట్టెఁగాక మొదటినుండి దానిగుణము తెలియనివారమా? దానిక్షమింపుము. అది కడుఁగటకట పడుచున్నది. ఎన్నిమాఱులోవచ్చియుండెను. దానిదుఃఖముఁ జూడఁజాల. ఇప్పుడే పిలువఁబంపెద. కరుణింపుమా.

దశ—అయ్యో! వలదు. వలదు. ఆపతిఘాతుకి నేఁ జూడను. కౌసల్యా! నేనింకను గొన్నిదినములు జీవించియుండఁ గోరిన నీపనివలదు.

కౌస—నాథా! నాథా!

దశ—(ఊరకుండును).

కౌశ—మరల మూర్ఛగలిగెఁగదా?

దశ—రామా! రామా! ఇందేలపండుకొంటివి? (జోకొట్టి) పండుకొనుము. పండుకొనుము, నిద్రపొమ్ము. అయ్యో! ఈపదునాల్గేండ్లరణ్యముల నెట్లుంటివి? అయ్యో! నీకాలుసేతులెట్లు కాయలుగాచియున్నవి. నిన్ను మరల నేఁ జూడననియెంచి యుంటిసుమా? నీముద్దు మోముమరలఁజూడలభించెఁగా! పండుకొనుము. లేవకుము. ఆకైక మిమ్మునెంత బాధపెట్టెను. సీతా! ఏలనిలుచియున్నావు? కూర్చుండుము. లక్ష్మణా! కూర్చుండుము. ఊఁపే చేయుదమా రామా నీపట్టాభిషేకము? నీవు పోయితివి. భరతుఁడుచచ్చెను. ఈపదునాల్గేండ్లు వసిష్ఠుఁడే రాజ్యమేలుచుండె. సీతా! ఈమధ్యనా నీవీకొడుకుంగనినది? తెమ్మా మనుమని. (ఎత్తుకొని ముద్దాడి) ఆ ఈండ్లవాఁడా? ఎట్టిముద్దుమనుమఁడు. రామునిపోలిక తీసితీయకుండ నున్నాఁడే. సీతా! ఈముద్దుమనుమని నరణ్యమునఁగంటివే నీకానుపెవ్వరు చేసిరి? ఉపచారము లెవ్వరు చేసిరి!

కౌస—సుమిత్రా! నా నాథుఁడీయజ్ఞానస్థితినైన, మనుమని ముద్దాడుచున్నాఁడే. ఈ భాగ్యమైన నాకు లేదే.

దశ—“అజ్ఞానస్థితి” ఏటికే? కౌసల్యా! చూడు మీమనుమఁడెంత ముద్దుగారుచున్నాఁడు. నీకేమి వాక్యము ముద్దాడకున్నావు? అయ్యో! నీపేరేమి? ఆ ఈండ్లయ్యు నికింకను మాటలురావా?

కౌస—
సుమి— } హా! దైవమా! హా! నాథా!

దశ—కౌసల్యా! ఇంతవఱకు నేనేమిమాటలాడితినో యెఱుఁగ. నాకాయాసము మిక్కిలిగానున్నది. నేఁబ్రతుకనుసుమా!

కౌస—హా! నాథా! అట్లేలమాటలాడెదు? నీకేమయినది?

దశ—కౌసల్యా! సుమిత్రా! నేనిదివఱకు మీకుఁ జెప్పని రహస్యముఁ జెప్పెదను. నాకా యసురులతోడి యుద్ధమునకుఁ బోవకముందు ఘోరశాపముగలిగె. అది యింత వఱకు స్మరణకు రాదయ్యె.

కవిరాజవిరాజితము.

సరయువుప్రాంతనొకానొక రాతిరి సామజబుద్ధి ధరాసురునా
శరముఁ జంపితి దాని నెఱింగి వెసన్ దలిదండ్రులు వచ్చిరి దు
స్తరమగు పుత్రవియోగము గాంచి సుతా సుత యంచుఁ దపించు మదు
ర్వ్యరణము నొందు మటంచు శపించిరి మాను నె తాపసశాపము లన్॥

కౌస—నాథా! నీకలవరపుమాటలలో నే నిన్న నే యీపాపవృత్తాంతము వింటిమి.

దస—వింటిరా! ఆశాపఫలము ననుభవింపక తీఱునా? ఇఁకఁ గొన్ని గడియలకే నాయంత్య మున్నట్టున్నది.

వసి—ఇట్లేలందువు? నీకంటెఁ గష్టము లనుభవించిన వారు లేరా? అదిగో! కైకేయి వచ్చుచున్నది. ఊఱార్పుము.

[ప్ర: కైక—(దీనభావమున)].

కైక—హా! నాథా! నన్నేల యిట్లు నిరాదరణ చేసెదవు? నే నెట్లు భరింపఁగలను.

దశ—హా! హా! కైకా! కైకా! అయ్యో! కుమారా! రామా! (మోము ద్రిప్పి) నిన్నెట్టియిడుమలపాలు చేసితిని. నీకుఁ బగదాయ నైతి. మృత్యుదేవతకు వరము లిచ్చితి. నీపాలి యమకింకరుఁడ నైతి.

స్రగ్ధర.

నాకేళాదక్షు నాయున్నతగుణమణి నానవ్యకందర్పుఁ డయ్యో
కీకారణ్యంబులం జిక్కితివె తపసుసీకీడు చింతించి నిన్నున్
బోకార్పం గంటి నెంతో పాగిలితి నిఁక నేఁ బోమెద న్నిన్నుఁ జూడన్
గైకా నీకైక దా నాకలుషహరుని నాకాముని న్గోలుపోతిన్

అయ్యో! ఇట్లవునని యెఱుఁగఁగదా! అక్కటకటా! నామరణము వేళ నాముద్దుబాఁడు, నామోహపుఁబట్టి, నాకులభూషణుఁడు, నామన్మథమన్మథుఁడు, నా వేలుపుమొదవు, నాపూర్ణచంద్రుఁడు, నావంశాభరణము, నా తరుణార్కుఁడు, నానోముఫలము, ననుగన్నతండ్రి, నాధనము, నానిధానము, నాశిఖరము నాచూళికాభరణము, నాకమనీయావర్ణనము, నాచింతామణి, నాదైవము, నా సుకృతవిశేషము, నాజీవరత్నము, నా యనుంగుపాపఁడు నాపంచనుండుటకు నోఁచనైతిఁగదా? రామా!

సూర్యకుల కలశవారాన్నిధిసోమా! నిన్నెంతలయించితి. ఎట్టినిష్ఠురాటవులకుఁబంపితి. ఎంతక్రూరకృత్యమొనరించితి. కుమారా! నీవీపురికి మరల వచ్చినపిదప నన్నుక్షమింప వలయు సుమా? అప్పుడు వేఁడికొనుటకు నేనుండఁగలవాఁడఁగాను. ఇప్పుడే బ్రతికి యుండఁగనే విన్నవించెద. ఎట్టిక్రూరాత్ముఁడనైనను, నెట్టి భీకరశాత్రవుఁడనైనను దండ్రినగుదుఁగదా? నిష్కారుణ్యముగ నిన్ను భయంకరాటవులకుఁ బంచి నిర్లజ్జయై నాప్రాణలతికఁ గుఠారమెత్తిన యాకిరాతకవిధవనే నీవెగ్గుబాడ వైతివే. ననుక్షమింప వా? వృద్ధుఁడనై, సత్యపాశాబద్ధుఁడనై వృద్ధుఁడనైన నన్ను క్షమింపవా?

లయగ్రాహి.

మందమతినై మదనసుందరునినాకొలపుఁ
జందురుని నందమగునందనుని నిన్నున్
డెందమున నింతయునుఁ గొందలములేక వను
లందు ధరణీధరములందు వసియింపన్
బందురగఁ బంచివెఱఁగంది దిగులొంది బెడఁ
గొంది వడఁగంది మదిఁగుందితిఁ గుమారా
సుందరతఁ జిందునరవిందములఁ జందురుని
విందుగను నీముఖ మిఁకెందుఁ గనుగొందున్॥

అయ్యో! ఏమిక్షమించి యేమిప్రయోజనము? నీముద్దుమోము మరలఁజూడఁ జాలఁగదా? అక్కటా! నీ వాపాపవిపినములకుఁబోవు నాఁడు నాతో మాటలాడితివే, అదియే కడమాటాయెఁగా? నాకునమస్కరించితివే అదియె తుదనమస్కారమా? నన్నా శ్లేషించితివే అదియె యంత్యాశ్లేషమా? నీవురథమెక్కి పోవ వెనుదవిలిచూచితివే యదియెకడచూపా? అక్కటా! ఎట్లుభరింతు?

సీ॥ వనికేగునాఁ డమ్మన్ జనకా యనుచుఁబిల్చి
తదియయో కడపిలుపాయెనాకు
ఆకైకయింట నిన్నాలింగనముసేయు
టదియయో కడసారియాయెనాకు
ఆనాఁడు నీవదనారవిందముచూచు
టదియయో కడచూపెయాయెనాకు

అలనాఁడునీవునన్నడలకుమనియంటి
వదియయో కడమాటయాయెనాకు
తే॥ గీ. ఎటులభరింతుఁదరియింతు నిలఁజరింతు
నుసురుచాలింతుఁ బలవింతు నుమ్మలింతుఁ
గడఁగివేఁగింతుఁదుఃఖాంతుఁగలవరింతుఁ
గృతముగణియింతు రఘురామరిపువిరామ॥

ఆసీతాస్వయంవరమునాఁడు లోకమువారందఱు నిను మెచ్చి మెచ్చిపొగడుచుండఁ గర్ణానందముగవింటినే. ఇట్టికీర్తివంతున కీర్తివంశభూషణునకుఁ బట్టముగట్టక నారాజ్యమేలయనియోంచితినే. ఎంచియు మఱచితినే. మరణసూచకమగు దుస్స్వప్నము వచ్చు వఱకుఁదలంపనైతినే. భరతుఁడిందున్నప్పుడే యాస్వప్నమురాగూడదా? నావిధినన్నింతచేసెను! అయ్యో! తాపసులే. శతవృద్ధులే. అట్టివారి యేకపుత్రుని నిరపరాధుని నాపాడుబాణమునఁ జంపితినే. నాకునలుగురు కొడుకులుండియు వారిలోనొకని నరణ్యమునకుఁ బంపుట కిట్లుపరితపింతునే. ఆయేకపుత్రునిఁగోల్పోయి యావృద్ధాంధదంపతులెంత నొచ్చిరో. ఎంత కటకటపడిరో. ఎంత శపించిరో. అటుతప్పులైనవా రిచ్చిన శాపము నాకుఁ దప్పునా? నిర్దగ్ధము చేయదా?

క్రౌంచపదము.

దానవభీమా-తారకనామా-ధరణీవర వినుతదశరథ రామా
దీనసురాగా-ధీగుణయోగా-త్రిదశవరనుత విదితబహుభోగా
మానవవీరా-మారశరీరా-మురరిపుమహీధరమదపవిధారా
భానుసుతేజా- పాలితరాజా-బహుళసుగుణయుత-వరితధరాజా॥

హా! సీతా! ఇందుఁగల సర్వైశ్వర్యములమాని నీపతివెంటఁబోయితివిగా.

సుగంది ॥ ఈడు లేనిసాధ్వి నీవహీనభంగినీపతిన్
గూడిరాజ్యభోగ మొందఁ గోరియుంటిఁగాదె యా
పాడుకాన నెట్లునీ వపార దుఃఖమొందెదో
కోడలా నినుందలంపఁ గుందుచూనదమ్మయో॥

రామా! భరతుఁ నఱగంటఁ జూడకుము. వాఁడు నిరపరాధియ కానోపు. ఈ దుడుకుచెయిద మీదుర్జాతిన కాక వాఁడు పాపరహితుఁడుగా నుండనోపుసుమా. వానిక్షమింపుము.

## అనుబంధము 36

రామా! రామా రామా! (చచ్చును).

కౌస—నాథా! రాముఁడునీకుఁజెప్పఁడామమ్మూఱడింపుమని? ఇదియూఱడించుటయా? ఏలమాట్లాడవు? (చూచి) హా! నాథా! (పడును)

సుమి— } (చూచి) హా! ప్రాణేశా!
కైక— } (పైఁబడుదురు)

వసి—ఏమి? ఏమి? ఏమి?

కౌస—ఇంకేమి? నిర్దయస్వాంతుఁడై మాపతి మముఁ బాసిపోయె.

వసి—హా హా హా హా హా! హరి హరీ! (లోనికిఁబోవును).

## అనుబంధము 37

కౌస—నాథా! మమ్మునిట్లనాథలఁ జేసిపోయితివే. మాపైనింత కరుణ కలుగదయ్యెనే. ప్రాణేశా! మేమెందుఁజొరుదారము? మమ్ము నెవ్వరుమాటాడించెదరు? రాముఁడు నాకులేకపోయినను. నీశుశ్రూష చేసికాలముగడపెదనని యెంచియుంటినే. ఆపుణ్యము నాకు లేదయ్యెనే. ప్రాణకాంతా! "రామా! రమ్ము కూర్చుండుము. పండుకొనుము". అని కలవరించుచునైన నింకఁగొన్నియేండ్లుండవైతివే. నీవుకొంతదుఃఖమనుభవించి కన్నులుమూసితివి. మాకుఁగదా పడరాని పాట్లుగలిగె! నీవు సత్యసంధుఁడవని ప్రతిజ్ఞ నెఱపి జగములఁ గీర్తిగంటివి. రాముఁడు జనకునాజ్ఞ నెఱవేర్చిన కీర్తిఁగనియె. దుష్ఫలములన్నియు మాకుఁగలిగించితివి. అయ్యో! సత్యమునకై కొడుకుంగానలకంపితివి. సత్యమునకై మరణముఁదెచ్చుకొంటివి. సత్యమా! సత్యమా! హా! నాథా! (మూర్ఛిల్లును)

## అనుబంధము 38

కైక—హా! నాథా! ఇట్లవునని కలనైన నెంచనైతినే. ఏమిప్రాప్తిఁ దెచ్చికొంటిని. ప్రాణేశా! ననుఁ గన్నెత్తిచూడుము. నాకువరములువలదు. ఇంకడుగను. ఏవరములు వలదు. రామునిఁ బిలువఁబంపుము.

కౌస—కైకా! మాపలె నీవేల యేడ్చెదవమ్మా సంతోషింపక? నీకొడుకునకుఁ బట్టము గోరికదా యింత కార్యముఁ జేసితివి? నీయపరాధమునకు ఫలము నీతోడ మమ్ము విధవలఁజేసితివే. అమ్మా! నీకేమికొఱఁత. కొడుకున్నాఁడు. చక్రవర్తియయ్యెడు నాకుఁ గొడుకులేఁడే. నానాథుండు పోయెనే. హా! నాథా! నాథా!

సుమి—ప్రాణేశా! ననుఁ జూచినప్పుడంతయు నాకు సుమిత్రనామము కడుసార్థక మనుచుంటివే. "సుమిత్రా" యని నన్నెవ్వరింకఁ బిలుచువారు? కైకా! ఇంక సర్వసుఖము లనుభవింపుము. నేనేమి తప్పొనర్చితినే? నన్ననాథఁగాఁ జేసితివి.

వసి—(వచ్చి) రాజదేవులారా! ఇంకేమి ప్రయోజనము? మీరెంతశోకించినను దశరథుఁడు రాఁగలఁడా? ఊఱడిల్లుఁడు.

కౌస—అయ్యో! మా దశరథుఁడింకెక్కడనున్నాఁడు. ప్రాణేశా! నీముద్దుకుమారుఁడు రాముఁడరుదెంచినాఁడు చూడుమా.

అనుబంధము 39

## తృతీయాఙ్కము సమాప్తము.





# పాదుకాపట్టాభిషేకము.

---

## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.

### బాట (దారి).

[ ప్ర: భరతుఁడు, శత్రుఘ్నుఁడు (రథముపైన) ]

భర—శత్రుఘ్నా! రథమింత నిలుపుము.

### అనుబంధము 40

ఇదె యయోధ్యకోశమాత్రమున్నది. ఊరుదాఁపురనువచ్చినది. కడుపునఁజేయివెట్టి కలఁచినట్లయ్యెడు. గుండెదిగులయ్యెడు. మరలనైన నీజాబుల యర్థమాలోచింతము.

శత్రు—ఇన్ని మారులు చదివితిమే—

భర—ఐననేమాయెను? మరలఁజూతము. ఏమయినఁ దెలియునేమో. (జాబులుదీసి) ఈజాబు మాయయ్య యీచైత్ర శుద్ధ చతుర్థి వ్రాసినాఁడు. నాకు నష్టమినాఁడు ముట్టినది. ఇందేమియును విశేషములు లేవు. ఆకస్మికముగా రాముని పట్టాభిషేక మహోత్సవము తలపెట్టినట్లును, నిందులకు దుస్స్వప్నము కారణమనియు వ్రాసినాఁడు. నేను లేకుండుటకు మిక్కిలి చింతిల్లియు శుభదినములు లేనందున విధిలేక పంచమినాఁడే మహోత్సవము నెఱవేర్చుచు వని వ్రాసినాఁడు. దీననేమున్నఁగాని? ఈ మంథరయును, వసిష్ఠుఁడును వ్రాసినజాబులే యవిదితార్థములుగ నున్నవి. మన తండ్రి వ్రాసిన జాబు నాకుముట్టిన యష్టమినాఁడే మంథరజాబును ముట్టెఁగదా? అయిననది దానిచేఁ బంచమినాఁడు వ్రాయఁబడినది. దీనిమరలఁ బర్యాలోచింతము. (చదువును) "చేయు విజ్ఞప్తులు. ఇందు విశేషాంతములు మొదలుగా జరిగినవి. పూర్ణఫలితార్థము దెలిసికొనక వానినన్నిటి మీరువినివేసించుట యనావశ్యకమని మానితి. అవిమీకు మిక్కిలి సంతోషావహములగుటచే మున్ముందు మీకీజాబుమాత్రము వ్రాసితి. ఎట్టి సంతోషమైనను, స్వల్పదుఃఖముతోఁ జేరిననే యానందజనకము. బుద్ధిశాలురు గాన దుఃఖమును మఱచి సంతోషమునే గ్రహింతురు. మీరు సుధీశాలురేక దా? మీసంతోషమునకు నేనే కారణభూతనౌటచే ముందీజాబువ్రాసి యున్నాను. మీరిప్పుడేమియుఁ ద్వరపడి రావలసిన యవశ్యకము లేదు. ఎంత యాలస్యముచేసిన నంత మేలు, కార్యసాధకమునునగు. ఇట్లు. మంథర"

ఇంతయైనను దీనియర్థము తెలియదుగదా? సంతోషమేమో, చింతయేమో తెలియకున్నది. నాఁటినుండి వృత్తాంతమే తెలియక పరితపింప శుద్ధత్రయోదశినాఁడు వసిష్ఠులు వ్రాసినజాబు మొన్నపూర్ణిమనాఁడు ముట్టెనుగదా? దానిచే నిలకింతయు. "రాముపట్టాభిషేకము నిల్చియున్నది. ఈజాబందినతోడనే యతిశీఘ్రముగ నీవు రావలయు. మనోవేగమున నీవు వచ్చినను, నింకను నాలస్యమే యగు. ఇందు జరిగియుండు సందర్భము లెన్ని గ్రంథములు వ్రాసినను దీఱదు. అవి క్షేమవార్తలనుటకును, దుఃఖవార్తలనుటకును, నీచెనున్నది. ఈజాబు తెచ్చినవారి నేవృత్తాంతము నడుగవలదు. నీవేమడిగినను మూకభావము వహించియుండవలయునని వారికి గట్టికట్టడయేర్పఁబడినది. నీవిందు వచ్చువఱకు నిక్కడియుదంతములు నీకుఁ దెలియఁగూడదనియుఁ దెలిసినను ప్రయోజనములు కావనియు నిట్లేర్పఁబడియున్నది. ఈజాబు చేరిన మూఁడవనాఁడు, తుదకు నాల్గవనాఁడు, నీవయోధ్యకుఁ జేరకున్న నీవు దశరథునికొడుకవనుట నిష్ఫలము. ఇది గురువు నాజ్ఞగా భావింపుము"

ఇందు శ్రీకారముగాని కుశలోదంతముగాని తుదకాశీర్వాదమునైన వ్రాయలేదు. ఏముండును?

శత్రు — భరతా? ఎన్నిమాఱులో చదివితిమి. ఏమైనఁ దెలిసెనా? ఇదే యూరు సమీపించె. పోయిన నన్నియు విశదములగుఁగదా?

భర — శత్రుఘ్నా! ఎట్టియుత్పాతములు జరిగియున్ననో తెలియకున్నదిగదా? మాఁజనకుని పాదములకు నమస్కరించి యతని యాలింగనము వడయువఱకు, శ్రీరాము చరణముల కెఱఁగి యతని దీవనలు వడయువఱకు, లక్ష్మణుని సౌఖ్యోదంతము వినువఱకు నాకూఱట కలుగదుగా? శత్రుఘ్నా! చూచితివే యీపురము పాడూరివలె నున్నది. ఈపౌరులఁ గంటివే. నన్నుఁ జూచి కన్నీరునించి మోములావలఁ ద్రిప్పుకొని పోవుచున్నారు. నన్నెట్లు చూచెదరు. నాకుఁ గళవళ మగుచున్నదిసుమా. ఈసంతాపమునకుఁ గారణము దశరథుఁడో రాముఁడో మఱియెవ్వరో యెఱుంగఁగదా?

మ॥ పురివారల్లను గాంచి కన్నులను వాఃపూరంబు నిండంగ సో
దర యావైపున మోముద్రిప్పి చనుచుందంబూహ చేయంగదు
స్తర మాతండ్రియొ రాముఁడో జననులో సౌమిత్రియో సీతయో
పరితాపంబునకుం గతంబు మఱియెవ్వారో యెఱుంగంగదే॥

మ॥ వికచాబ్జాభము ధారుణీశు ముఖముఁ వీక్షింపఁగాఁగల్గునో
సుకృతోదంచితసాధ్వులఁ జనులఁ జూడంగన్నాఁడనో
యకలంకంబగు రాము మోముఁ గనుభాగ్యంబున్నదే యెట్టులో
నెకో వీనుంగవనెట్టి వార్తవినఁగానున్నాఁడనో సోదరా॥

అదియేల నగుమోములర లక్ష్మణుఁడు నాకెదురు రాకున్నాఁడు? రథమింక నిలుపుము. వెనుకకుఁబోదము. క్షేమోదంతములన్నియుఁ దెలిసి మఱీవత్తము.

శత్రు—ఇట్లధైర్యపడి ప్రయోజనమేమి? కైకేయి మాతయుల్లే సమీపముననున్నది. అయ్యో దకే పోవుదమా?

భర—ఎక్కడికైనను బోనిమ్ము. కన్నులు చెవులు మూసికొనియుండెద. "క్షేమ" మను వార్తనోట వచ్చువఱకు నిట్లెయుండెద. అయ్యో! నాపాడుచెవులీనాఁడెట్టి వార్త విననున్నవోకదా?

శత్రు—ఊరడిల్లుము. కైకేయి మాతయింటికే రథము పోవనిచ్చెదను.

(నిష్క్రమింతురు)



## చతుర్థాఙ్కము-ద్వితీయరంగము.

### కైకేయి యిల్లు.

[ప్ర: కైకేయి (దుఃఖమున)—మంధర.]

మంధర—కైకా! దుఃఖింపకుము ఏమిచేసినను దశరథునిఁ బడయఁగలవా? వయసు చెల్లినవారిఁ బెండ్లియాడిన కాంతఁ కంతయు రాఁదగిన గతియే నీకుఁగలిగెను. నీవేమి లోకమున కరుదా?

కైక—మంధరా! నీదుశ్చరితముగదా నన్నీగతికిఁ దెచ్చెను. నేనందఱివలె సౌఖ్యముగ నే యుంటినే.

అనుబంధము 41

సీ॥ కలకాలమపకీర్తిఁ గలిగించు నత్యంత
కలుషకృత్యం బంచుఁదలఁపనైతి
పోకార్పవిపినాళి లోకైకవీరుఁడౌ
సుకుమారుఁడే యంచుఁజూడనైతి
పాపంబుఁ దలపోయ కాపాదువరముల
కిదిఫలంబగునంచు నెన్ననైతి
నాథుండు సవతులు నాకాళ్లఁబడివేఁడ
నార్ద్రమానసమింత యరయనైతి
తే॥గీ॥ నవనియువతులలోన నత్యధమనైతి
ధవునిపాలిటికేఁ బగదాయనైతి
విపులసంకటములఁగుందు విధవనైతి
మంధరా లోకనింద్యనై మనఁగనైతి॥

మంధ—నీకు వ్యసనము వేళ్ల గనుక నీపేరున్న నూరకుందును. ఔనమ్మా! నాదుశ్చరితమునసే నీవు చక్రవర్తిమాతవైనది. నాదుశ్చరితమువలన నీకేమినొవ్వులైనదే? నీపతి యింకఁగొన్ని దినములకైనఁజచ్చియుండఁడో? రాముఁ దాసుఁడైయుండఁదగిన నీపట్టి చక్రవర్తియవుటయుఁ, గొన్ని దినములకైనఁ జావకున్న నీపతి యిప్పుడేచచ్చుటయుసరిపోల్చి తులఁదూఁగఁజేయుము. ఏదియొక్కువగునో? ఆదియెట్టిపతియో!

నీను మెచ్చి వరములిచ్చి నీకు స్వతంత్రముగల వరములడిగిన మాత్రముననే, తాఁజచ్చుట వఱకు నీముఖము నైనను జూడలిపతి యేటిపతి యేకీళపతి? అతఁడుండి యేమిసుఖ మనుభవింపనుంటివి? నేను ఖండితవాదినిగానఁ గనలకుము. అతఁడు పోయినదే యుప్పుడు భరతునికి శ్రేయము. తండ్రియుండిన భరతుఁడు రాజ్యమేల నొప్పుకొను చుండెనో లేదో? ఇప్పుడు నిరాటంకము. ఇప్పుడో యింకొక, క్షణముననో భరతుఁడు రానున్నాఁడు. వాని యెదుట నీవిట్లు చింతతో నేడ్చుచుండిన నేమనుకొనును? ఇది యెవ్వరిబోధనయో యిని యిట్లు చేసి యుండునని యనుకొనఁడా? నీవింత చేసి సవతులవలనఁ దిట్లుపడి కన్నముండలతో ననుఁదిట్టించి పతినిఁ బోవఁగొట్టుకొని యందఱివలనఁ దిట్టువడుటకా నీవిట్లొనర్చుట? వండి తపిలదించి యాకున నుంచుకొని యనుపానము గలిపి కబళముఁజేతఁబట్టుకొని నోటికిఁగొనిపోవునప్పుడు వేలఁబాఱ వేయఁజాచెదవే. అదిగో! రథధ్వానము. భరతుఁడే వచ్చెఁగాఁబోలు. దుఃఖము మానుము. మందహాసముఁ దెచ్చికొనుము. కార్యము సాధింపుము.

[ప్రవేశము: భరతుఁడు శత్రుఘ్నుఁడు.]

భర—
శత్రు— } (కైకకు నమస్కరించెదరు)

కైక—(మందహాసమున) అన్నా! భరతా! లెమ్ము.

భర—మాతా! ఊరంతయుఁ జాలుపడియున్నది. ఎట్టివిశేషములుగలిగె? జనకునకు క్షేమమా? తల్లులకందఱికి సౌఖ్యమా? సీతారాములకుఁ బ్రమోదమా? లక్ష్మణునకుఁ గుశలమా? ప్రజలకంతయు నానందమా? రాముపట్టాభిషేకమేలనిల్చెను? నీముఖమేటికి స్మితసహితమయ్యె వంతమానదు?

భుజంగ ప్రయాతము.

క్షమాధీశుఁడమ్మా సుఖంబున్నవాఁడే
సుమిత్రాదిమాతల్విశుద్ధల్శుభంబే
ప్రమోదంబె రామున్కు రామానుజుండున్
సమాఖ్యాతయాసీత సౌఖ్యంబెమాతా ॥

కైక—కుమారా! ఈ దశరథుఁడు నను మోసముచేసి నిన్నువంచించి నిన్ను గిరివ్రజపురమునకుఁబంపి రాముని పట్టాభిషిక్తుఁజేయ నెంచెను. అల దేవాసురుల యుద్ధమునాఁ డతఁడు నాకు రెండువరముల నిచ్చియుండె. ఇప్పుడు వాని నడిగితి. ఒకటికి నీకుఁ

బట్టముగోరితి. మఱియొకటికి రాముఁడు తాపసవృత్తిఁ బదునాలుగేండ్లరణ్యమున నుండ వేఁడితి. సీతాలక్ష్మణులతో రాముఁడరణ్యమునకుఁ బోయె. ఇప్పటి కేడుదినముల క్రిందట దశరథుఁడు మాత్రము కాలధర్మమునొందెను.

భర— శత్రు— } హా! పతిఘాతుకీ! పుత్రఘాతుకీ! (మూర్ఛిల్లుదురు)

మంథ—(తొంగి చూచుచుండును).

భర—(లేచి) హా! పుత్రఘాతుకీ! నీ వేలపుట్టితివి? నా కేలతల్లి వైతివి? సుకుమారుఁడైన రాముని వనవాసపు టిడుమఁ గోర నీనో రెట్లాడెను? అక్కటా! నీవు కేకయరాజునకు జనించినదానవా, కఠినరాక్షసునకు నీతల్లి నినుఁ గనియుండవలెఁ గాక? ఇట్టిద్రోహబుద్ధి నీకుండునా? ఏమి నేరము చేసె ముద్దుకుమారుని, నాకులస్వామిని, నా దేవదేవుని, వనవాసమునకుఁ బంపి పతినిఁ జంపుకొంటివే? దశరథుని పాలిదెయ్యపు దేవతవైతివి. ఇట్టిక్రూరకృత్యము గావించి యిక నన్ను దెవ్వగొని నాతో మాటలాడనోపితివా? నీకుఁ గొడుకనవుటచే దుర్మార్గుఁడనైతి. అపకీర్తిపాలైతిని. హా! ఆరామునిఁ బాసి నేను రాజ్యమునకు సమ్మతింతునని నమ్మితివా? నీకు జనించినమాత్రనే నీయట్టి క్రూరమానసము నాకుండవలె నెంచితివా? నాకుఁ బాపసేవలేఁ సురరాజ్యమైన నే నాశింతునా? నాజనకునిఁ జంపఁగలదానవని యొక్కనాఁడు నిన్నెఱుంగఁగదా? అయ్యయ్యో! తల్లిబిడ్డలకుఁ, దండ్రికొమారులకు, నన్నదమ్ముల కెడవు చేసితివిగదే? అక్కటా! ఆజనకుఁడు నన్నెంత తిట్టుకొనుచుఁ బ్రాణములఁ బాసెనో! ఆరామునికి నాపైనెంత విసుగుకలిగెనో? అయ్యో! ఈజన్మ మేటికి? శ్రీహరీ!

శత్రు—భరతా! ఇదిగదా యింతకుఁ గారణము? ఇప్పుడు తెలిసెనా? ఇది నీకుఁ జావు వ్రాసినలక్షణ మిప్పుడైన నెఱుఁగనయ్యెనా? ఆ సంతోషమంట! ఇదిస్వల్ప దుఃఖమంట! స్వల్పదుఃఖము వృత్తాంతము వినవలెనేఁగదా. ఈపలుగాకి, యీ బాలఘాతుకి యీజగజంత, దుర్జాతి! చావుము, (మంథరను బడవేసి కుత్తుక ద్రొక్కును).

మంథ—అయ్యో! అయ్యో! చచ్చితి. చచ్చితి!

శత్రు—(కత్తిపట్టి) ఈదురాత్మురాలినిపుడ—(కైకపైఁబోవును).

భర—(నిలిపి) శత్రుఘ్నా! ఈకులద్వేషిణిఁ జంపినపాపము మనకేల? ఎట్టిద్రోహమానసయైనను మనతల్లియందియును మహాపయశము మనకుఁ గలదుగా? ఇది పతి పుత్రఘాతుకియైనను మనము మాతృఘాతుకులేల కావలయును? మనమిట్టు చేసిన

మమ్ము రాముఁడు ద్రోహులనఁడా? ఆదరించునా? దీనిఁబంపుట రామునికి హిత మైన లక్ష్మణుఁడు చంపకుండునని యెంచితివా? ఈనుద్దాతి మంథర చావశ్రై యయున్నది. ఇట్లొర్చినందులకే రాముఁడు మమ్ము నేమనునో?

కైక— హా! దైవమా! (నిష్క్రమి)

అనుబంధము 42

భర—శత్రుఘ్నా! తరంగతరంగములుగా దుఃఖము గలుగుచున్నదే. హా! జనకా!
(మూర్ఛిల్లును) (యవనిక పడును)

## చతుర్థాఙ్కము-తృతీయరంగము.

### భ ర తు ని ల్లు.

[ ప్ర: భరతుఁడు బాబు చేఁబట్టి]

అనుబంధము 43

సీ॥ మా రాఘవుఁడు లేమి మసనమైతోఁచు నీ
పాడూరుగన్నెత్తి చూడఁగలనె
తలయెత్తరాని నిందలమోచిదుష్కీర్తి
నవనిపైనిఁకఁ దిరుగాడఁగలనె
కనినయంత నెలోనఁ గటికిశోకమునించు
కైకేయివదనంబుఁ గాంచఁగలనె
పడరానిబన్నముల్ పడినకౌసల్య కీ
పాపపుమోమింకఁజూపఁగలనె

తే॥ గీ॥ రాముపదసేవమాని నేఁబ్రదుకఁగలనె
వెలయభూజాతఁగనక జీవింపఁగలనె
యనుజులక్ష్మణు నెడఁబాసిమనఁగఁగలనె
కటకటా శోకజలరాశిఁ గడవఁగలనె॥

హా! దుఃఖము! శ్రీరామునింకెన్నఁడు చూతును? అతఁడు నన్నెట్లుకరుణించును? కరుణింపకున్న నసువులధరింపఁగలనా? అయ్యో? నేనెంత ప్రార్థించినను, జనకాజ్ఞ పాలింప కతఁడు తిరికివచ్చునా? అతఁడు రాకున్న నేనిందుండఁగలవా ? ఆరాముఁడు

అర్థిజనసురారాముఁడు, పాదచారియై యరణ్యములనుండ నేఁ జతురంతయానములఁ బురమునఁ దిరుగాడుదునా? అతఁడు కందమూలఫలాహారుఁడై యుండ నే భక్ష్యభోజ్యముల స్వీకరింతునా? అతఁడు ధరాతలశయానుఁడై యుండ నేఁ బాన్పులపై శయనింతునా? అతఁడు పర్ణశాలావాసుఁడై యుండ నే సౌధాంతరములనుందునా? అయ్యో! ఎట్టికఠినమానసకే జనించితి? కటాక్షమాత్రమున ముల్లోకములఁ గలంపఁగాలు తమ్మునితోఁ జంద్రికాయుతసుందర మందస్మిత మాత్రమున నిట్టికైకఁబోలు వారిఁ బదివేవుర దాసీజనములుగా నొనర్చియేలఁగాలు ప్రియకాంతతోఁ గట్టెదుటనిల్చి వనమున కనుజ్ఞయిమ్మగ నీదృపతృతినమానసము మెత్తవడదయ్యెఁగా! నేనికైక కేలజనించితి? కౌసల్యకైనను బుట్టనైతి నే. ఊరక రణ్యములకుఁ బోవుమంటి నే. అయ్యో! ఇట్టినిర్భాగ్యునకట్లేలయగు? జగదేకమాన్య సుగుణాకల్యాయగు కౌసల్యకు నాయట్టి కలుషాత్ముఁడు జనించునా? జనలోకావనుఁడై, ఖ్యాతచరిత్రుఁడైన రాముఁడీ కులపవిత్రకు నపయశఃపాత్రకు, నీజీవితశాక కైకకు జనించునా? అయ్యో! ఈ కైక యొంటికైనఁ జెనుగొంది నాయొక్కని మేలుకోరికనికదా యిట్టిదుష్కృత్యమొనర్చె? ఇదెట్టి విపరీతఫలముగలిగించె! దశరథుఁడన్న యెంతదుఃఖమైనను నాల్గుదినములనుభవించి కన్నులుమూసె. కౌసల్యయో పతివియోగమునకును బుత్రవియోగమునకు. నిప్పుడు దుఃఖించినను బదునాల్గేండ్ల పిదపనైన సుఖములనుభవింపఁగలదు. సుమిత్రయునట్టిదేయగు. రాముఁడన్నసతితోఁ దమ్మునితోఁ బదునాల్గేండ్లు సౌఖ్యమునఁ గడపి రాఁగలఁడు. ఇంతలిదుఃఖములొక్కటియు నెఱుఁగక సౌఖ్యముగ నున్నాఁడు. లక్ష్మణునకన్న, ఆయన్నపాదపద్మములు గొలిచియుండుటకంటె సౌఖ్యమేమున్నది? సీతాదేవియో, పతియందు బద్ధానురాగయై తదేక శేషిత్వ భావమునఁ గలిసియుండుటఁ జింతయేమి? నాసంగతిగదా పరమసంతాపకరము. కన్నతల్లిశత్రువాయెను. పెద్దతల్లులకును, సీతారామలక్ష్మణులకును నేఁ పగవాడనైతిని. అయ్యో! ఎక్కడిపగవాఁడ. పగతుఁడనైనను దనశత్రువు తపసివేషముననరణ్యములనుండుమని కోరునే! కటికచండాలుఁడఁగదా? తండ్రియో నన్నుఁ గలుషాత్ముఁడనియెంచి యట్టిమానసమునే నను జూడకఁ మాటాడక మనవి వినక మృతిఁబొందె. అతనిఁ బోవఁగొట్టికొంటి. చచ్చునప్పుడును దండనుండనైతి. అతని చావుచూచినవి చాలక, హృదయము కుమిలించు నతని యంత్యక్రియలు నేనచేయఁబాపడితి. కటకటా! జనకా! నీవు నాకెవ్వరిచ్చువారు? ఈదుఃఖాంబుధి నేగతిఁ దరియింతు. తలయెత్తుకొని యింకేభంగిఁ జరియింతు? సంతాపము నెక్కడ భరియింతు? నాప్రాణానిలముల నేమాడ్కిహరియింతు? కౌసల్యకు మోమెట్లు చూపుదు. నాప్రాణానిలముల నిప్పుడే పోకార్చువారుగలుగరా? సంహననౌషధము లేభిషగ్వులైన నాకీరా? మారణమంత్రముల నేమంత్రవాదులైన నాపైఁ బ్రయోగింపరా? హా! నిర్భరము. రామా! రామా! కైకా! కౌసల్యా! జనకా! (మూర్ఛిల్లును).

## తురీయరంగము-కౌసల్యానగరు.

[ ప్ర: కౌసల్య (దుఃఖించుచుమూర్ఛిల్లి), ]



భరత-శత్రుఘ్న-వసిష్ఠులు ( ప్రకృన)

భరత—సంయమీంద్రా! నాచేతఁగాదు. ఇన్ని సంకటములకోర్చితిని. ఇదిశక్తికి మీఱి యున్నది. నేనామెకు ముఖముఁజూపఁజాల.

వసి—భరతా! ఇట్లయిన నెక్కడికిఁ బోరము. ఊరకరమ్ము. శత్రుఘ్ననకుఁ దెలిసినంత నీకుఁదెలియదా?

భర—ఋషితిలకా! శత్రుఘ్నునివలె నేఁగానైతినే. క్రూరాత్మకయగు కైకగర్భము నుండి వెల్వడిన కాలసర్పమనైతినే.

### అనుబంధము 44

కౌస—నాథా రాముపట్టాభిషేకము నీవు చూడనోపకున్నను, కైకకిచ్చిన వరమునకై భరతు పట్టాభిషేకమైన నీవు చూడనైతివే.

వసి—రమ్ము. రాకున్న నెట్లుతప్పును? (ఈడ్చును)

భర— ముందఱికివచ్చి) తల్లీ! ఏమూఁడక్షరములు లోకకంటకములై యాచంద్రార్కమపకీర్తిఁగనెనో, ఏమూఁడుకలుషాక్షరముల భరించిన నిర్భాగ్యుని సంతాపైక భోగుని గనుటచేఁ గైకగర్భము ఘోరవ్యాళమునకు మనికిపట్టగు గుహాకుహరమును, గాల భుజంగ సమాశ్రయమగు ఘోరవల్మీకమును బోలెనో, ఏమూఁడుపాపాక్షరముల వానివలన నీకును, సుమిత్రకును రామాదులకును బడరాని పాట్లుగలిగెనో, ఏమూఁడక్షరముల యర్థము పితృభ్రాతృఘాతుకమని జగముల నెగడెనో, ఆదుష్టాక్షరముల భ-ర-త నామము వహించిన క్రూరకర్ముఁడు వీఁడే. అమ్మా! వలసిన శాపమొసంగుము తెగదీయుము. దయచూడకుము.

### అనుబంధము 45

కౌస—అయ్యా! భరతచక్రవర్తీ! కొడుకును గోడలిని భీకరారణ్యములకుబంపి మగనిఁ బోఁగొట్టుకొని గత్యంతరముఁ గానకున్న మేమేడ్వవలయుఁగాక, నీయిష్టానువర్తనమున గావలసిన వరములొడుగఁ గైకయుండ, నీకోరిన సార్వభౌమపద మబ్బియుండ నీకేల శోకము?

భర—అమ్మా! కౌసల్యాదేవీ! రామలక్ష్మణులఁ బాసి దశరథు లేకుండఁ జేసికొని యపకీర్తిమై తలయెత్తుకొనకుండుటంబడిపోవ నసియాడుచున్న నాప్రాణముల నిప్పుడే తీసితివి. అయినను నిది యెంతతీఁపులో పాయనేరకున్నాను. అమ్మరో! రాముఁడు కరుణింపకున్నను, లక్ష్మణుఁడు కనలినను, దశరథుఁడు నను దప్పఁదలఁచినను, నాగుణము నీవు గుర్తెఱుఁగుదువుగదా యని నమ్మితి. దైవమున కింతకరుణయైనను రాదాయెఁగా? అమ్మా! నిక్కమాడెదను. నీచరణములాన వచించెదను. ఈసూర్యాకాశములు, దిగ్వాసియుఁ, బంచభూతములు, సూర్యచంద్రులిందులకు సాక్షులౌదురుగాక! తల్లిరో! ఈకైక మానసఘూకవ్యాళపాకయై యొనర్చిన పాపము వేగిరివ్రజపురమున నుండునప్పుడైన, అందుండ నిపుడుపైనున్న మాజనకుఁడీ జాబు వ్రాసినప్పుడైన, నిపుడువచ్చుపోవు ప్రాణముతోఁ దనకులాడుచుఁ జచ్చియుఁజావక యున్న యీకలుషములకు మూలకందమగు దుర్జాతిమంథర యీజాబు నాకువ్రాసినప్పుడైన, నాలుగు దినములక్రిందట మాతండ్రి పరలోకము చేరిన వృత్తాంతము సయితము నాకుఁదెలుపక యీవసిష్ఠమునీంద్రుఁడీకమ్మ పంపినప్పుడైనఁ, బురమంతయుం వెలవెలఁబోయి మసనంబు కరణిధూమధామమైయుండిన చందము నేఁజూచినప్పుడైన, నీపౌరులొక్కరొక్కరు నామోముఁ జూచి చూచి కన్నీరునించి నించి విసికి విసికి పెడమోముల నావలఁబోయినప్పుడైన, శత్రుఘ్నుఁడు రథముదోల నే నేతెంచి దశరథరాజన్యుని రామునికడమాట వినఁజేసిన పాపపునెలవగు కైకయిలు సొచ్చినప్పుడైన, నిన్ని యిడుమలఁ గలిగించి పతిని జంపియుం భయంకర స్మేరముపహించిన యాపాపిని పాదములకు నే నమస్కరించినప్పుడైన, నాకుఁ దెలిసియుండెనా, పంచమహాపాపలును, బకహింసకులు, మాతృహింసకులు, గన్యావిక్రయకులు పోవు పాపములకుఁ బోవువాఁడ. ఇదికల్లయైన, నాకు నరకప్రాప్తి గలుగుఁగాక! నాకుఁగూడు పుట్టకుండుఁగాక! నానోటబురువులుపడి పుచ్చిపోవుఁగాక! అంధత్వమును, చాదిర్యమును నాసంధిబంధములన్నియు ప్రీలఁబడిపోవుఁగాక! అంధత్వమును, బాధిర్యమును నాకొక్కసారియే కలిగి విచారించువారులేక, యడవుల మన్నుదిని దిక్కులేక మృతిఁబొంది నాశవమునదహించువారైనలేక గ్రద్దలపాలగుఁగాక! జననీ! ఆమేయమహిమోపేతుఁడై మాకులమున వెనుకటివారికి, నున్నవారికిఁ బుట్టుచున్న వారికి శిఖోపముఁడై నిజయశస్సుధాధవళితదిగంతుఁడై, పరసతీసోదరుఁడైఁ, సుగుణఖనియై, తమ్ములనన్నఁ బుత్రులకంటె నెక్కువగా నెవఁడు చూచునో, యెవఁడు గలుగుటఁజేసి కౌసల్యయనుపేరు సకలవీరసూసందోహములకు మాతృకయగునో, యెవని యుద్భవము సజ్జనహింసకులును, యజ్ఞయాగధ్వంసకులును నగు రాక్షసదివాంధ సందోహమునకు సూర్యోదయమో, యెవ్వనియపాంగము సజ్జనమానస

చకోరములకుఁ జంద్రికయో, యెవ్వానిబూని పురందరనందనముందారసందోహములఁ దలలు వంచెడినో, యెవ్వనిప్రతాపము ప్రభాకరానల పద్మరాగ ప్రభలఁ బరిహసించెడినో, యెవ్వనిభ్రుకుటి ధారుణీవరవిదారిభూరికుఠారధారి నైన, ముకుళితహస్తుఁజేసెనో, యట్టియాచక కల్పకథామునకా, సుందరతను ప్రభాకామునకా, దుర్గ్రహప్రఘనభీమునకా, తరణికులాపాంనిధిసోమునకా, ఘనాయంతకుంజరస్థేమునకా, విచారితసర్వప్రకృతిజనక్షేమునకా, భ్రుకుటిమాత్రవినిర్జితపరశ్వధరామునకా, భూసురదత్తగోమణీఘరాగ్రామునకా, మహాసుర నికారణభూరి సంగ్రామునకా, నీలమేఘశ్యామునకా, జానకీకామునకా, రామునకా, నేనెగ్గు తెంచుట? అమ్మరో! నీవు శపుంతువని భయమొందను. ఈప్రాణములఁ దృణప్రాయముగ నెంచెద. ఆపురందరపదివియైన నణుమాత్రముగ నుపేక్షించెద. నేనిటుచెప్పికొనుట భయమువలనఁ గాదు. నీకుఁ బ్రియమనికాదు. మోస మొనర్పుటకుఁగాదు. ఇచ్చకమునకుఁగాదు. నీయట్టిసాధ్వీమతల్లి నిరపరాధి నైన నన్ను సంశయించె నేయని పాపమున కోర్వలేమి వచించితి. ఇంక వలసిన శాపముసంగుము. భరించెద.

[ ప్రవేశము: కైక (యొక ప్రక్కన) ].

శత్రు—మాతా! నేను దశరథుఁడు పట్టాభిషేకము చేయ నెంచినవాఁడనుగాను. మా తల్లి వరముల నడిగి నన్నభిషిక్తుఁజేయఁ గోరదయ్యెఁగదా? నామాట నమ్మవచ్చును. ఈ భరతుఁడయోధ్యవిచినది మొదలు నేఁటివఱకు వీనితోడ నేయున్నాను. ఈతఁడు నిరపరాధిసుమా!

వసి—. కౌసల్యాదేవీ! ఈభరతుఁడు నిష్కలుషుఁడు. వానిమన్నింపుము.

భర—మాతా! నేనిష్కలుషుఁడగాను. ఏపాపమొనరింపకున్నను, కులవిధ్వంసనముగావించిన యాగోముఖవ్యాఘ్రము, నావఙ్రహృదయము, నాకైకకు జనించినపాపమే—.

కౌస—(భరతుని నాలింగనము చేసి) కుమారా! భరతా! నీశుద్ధమానసము నెఱుఁగనా? కళవళముఁగన్న సముద్రములోని యలలమాడ్కిఁ బైపైవచ్చు దుఃఖపరంపరల కోర్వకిట్టాడితి. క్షమింపుము.

అనుబంధము 46

ఆరాముపేరై నినుపేఱుగాఁజూతునా? నీవే మారాముఁడవింక. అయ్యో! ఆకైక నేల యిట్లాడెదవు? నాకు సంతాపముకలుగదా? చిన్ననాఁటనుండి దాని నెఱుఁగనా? దశరథునిశాపముఫలింప దానికి నేఁడిట్టిబుద్ధిపుట్టెఁగాక. అదియును స్వబుద్ధిగాదు. మంథర బోధనమేయని తెలియదా?

కైక—(ముందఱికివచ్చి కౌసల్యపాదములపైఁబడి) జననీ! స్వబుద్ధికాదని యేలందువు? మంథరచెప్పినమాత్రముననే, నాబుద్ధిపురువు మేసెనా? అమ్మా! మాజననికిమాఱుగా నీవున్నదానవు. తల్లియెదుటఁబోలె వచించెదను. ఆమంథర నాపాలివిధివోలెఁ బీడించెను. ఎంతబుద్ధితిరిగినను మానకయుపదేశించెను. అప్పటికది యేప్రియమయ్యో? శివమెత్తినచందమునశరీరముపైఁబ్రజ్ఞలేక యెట్టివరములడిగితినో, యేమొనర్చితినో. ఎఱుఁగను. ఒక్కపాపము వేయొక్కపాపమునకుఁ దెరువుఁజూపెను. ఒక్కసారి పాపమొనర్చిన కఠినహృదయము దానిమెత్తపఱచు సందర్భములు గలిగినట్లంతయు మఱింత కఠినమగుచువచ్చె. ఇట్లయి యీగతికివచ్చితి. నీశాపోపహతిఁ గ్రుంగుచున్న నాకుఁ బ్రాయశ్చిత్తములేదు. బిడ్డయేయని కరుణించితివా, నాక్రూరకృత్యమున నరణ్యముఁబాలైయున్న రాముశరణము వేఁడెఁబోయెదను. అతఁడెట్లొనర్చినను హితమే.

అనుబంధము 47

కౌస—(కైకనుగౌఁగిలించి యేడ్చును).

అందఱు—(ఏడ్చెదరు).

వసి—ఇట్లూరక దుఃఖించిన నేమిప్రయోజనము? ఈకైకయే మనకిప్పుడుపదేశకర్త యాయె. ఇక్కడికార్యములఁదీర్చి యరణ్యములకు మనముందఱముపోయి రాము నుపాసింతము.

శత్రు—ఇక్కడి కార్యములేమున్నవి? ఇప్పుడె వెడలుదము.

వసి—దశరథుని పారలౌకికక్రియలు—

అందఱు—హా! దుఃఖము.

భర—సంయమీంద్రా! మాతండ్రిని సుగంధతైలకటాహమున నుంచితిమంటిరే? చూడ నైనఁ జూచెదను. కొనిపొమ్మా!

అందఱు—హా! హా! (నిష్క్ర).

—(చతుర్థాంకము సమాప్తము)—





# పాదుకాపట్టాభిషేకము.

---

## పఞ్చమాఙ్కము-ప్రథమసంగము.

### అడవిలోఁబర్ణశాల.

[ ప్ర: రాముఁడు-సీత- (రాముఁడు జడలతో)].

రామ—సీతా! చూచితివా యీచిత్రకూటాద్రి యెంతరమణీయముగానున్నది! ఇట్టి నిదాఘోష్మఖదినములను మధ్యాహ్నమున నెంతచల్లఁగానున్నది.

సీత—అవును. కడురమణీయముగానున్నది. ఇందెన్నిదినములుండినను దృప్తికలుగదు ఈఘనాటవుల నీనగాగ్రములఁ జెట్లెంతగొప్పవి. చూడుమా యీయశ్వత్థవృక్ష మెంత పెద్దదియో.

రామ—ఇదియేటికి మన మయోధ్యవిడిచిననాఁడు తమసాతీరమున నొక్కయశ్వత్థ వృక్షాంతికముననే విశ్రమించియుండిలేదా? అదియేమి తక్కువగానుండెను?

సీత—అయోధ్యాపురి పౌరులందఱును మనమును విశ్రమించియుండినదిగదా? అదియుఁ బెద్దదియే. అయ్యో! ఆరాత్రి యర్థరాత్రమున మనము పౌరుల కన్నుమఱఁగించి యేతెంచితిమే. వారెంత దుఃఖించిరో!

రాము—అట్లుచేయకున్న వారు మమ్మువిడుచుచుండిరా? ఇప్పుడు మాటలాడినదేమి? వృక్షములవిషయముగదా? గంగాతీరమున నొకరాత్రి గారచెట్టు నీడనుంటిమే. ఆవృక్షమెట్లుండెను?

సీత—అదియును బెద్దదియే. మఱియెక్కడనో యింకను గొప్పవృక్షమును జూచితిమి?

రామ—శృంగిబేరపురమున గుహునితో నున్నప్పుడు చూచినదియేకదా వటవృక్షము.

సీత—అవునవును. ఆవటవృక్షము పాలేకాదా—

రామ—నేనును లక్ష్మణుఁడు నుపయోగించి జడలుదాల్చినది. సీతా! ఆనాఁడు నీవెంత యేడ్చితివి? ఇప్పుడీజడలతో నేనెట్లున్నాఁడను?

రామ—ఆయనంగుని సంహరించిన పురవైరివలె నున్నాఁడవుగదా?

రామ—అయిన నాకు ఫాలలోచనమేదీ?

సీత—మొన్నఁజూచితి నా ఫాలలోచనమును.

కం॥ మంటలఁ గ్రమ్మెడుకన్నులఁ
గంటక మొనరించునట్టి కాకాసురునిన్
గెంటింపఁ గనినవేళన్
గంటిన్ సీఫాలలోచనము ప్రాణేశా॥

నీవు పర్ణశాలవాతోడ పైనిద్రింప నన్నుఁ జెనకిన కాకాసురునిపై నీవిషీకము విడిచినపుడు నిక్కువముగా నీకు ఫాలలోచనత్వమలవడియుండె.

రామ—నాకుఁ గల్గినకోపమును బల్కెదవా?

సీత—కోపము నే కాదు. ఆ కాకము తనకన్ను నీయస్త్రమునకివ్వదో. అదియే నీఫాల లోచనము. అప్పుడే నీవుమూసినది.

రామ—అయిన నీవాపుర వైరి కనఁగుని సాహసించిన పిదపఁ జేకూరిన గిరిరాజసుతవే.

సీత—ఆమె నేనెట్లగుదు? ఆమెశంకరులో నర్ధాంగినికాదా?

రామ—నీకర్ధాంగ మేటికి పూర్ణాంగముగావింతు (కౌఁగిలించును).

[ ప్ర: (శీఘ్రగమనమున విల్లెత్తుకొని)-లక్ష్మణుఁడు].

అనుబంధము 48

లక్ష్మ—నీశాంతగుణమే నిన్నింతవుఁ దెచ్చె. లెమ్ము. పైఁబడియేతెంచు శత్రుస్తోమము ముంజించి చెండాడుదము. నీవురాకున్న నాకైన నాజ్ఞయిమ్ము.

రామ—నీమాట లేమియుఁ దెలియవు-శత్రుస్తోమమేది?

లక్ష్మ—అందుఁజూడుము ధూళిరేమొల్లగయుచున్నదో?

రామ—అవును. దేః ధూళియది?

లక్ష్మ—భరతాది శత్రువర్గము వచ్చుచున్నది.

రామ—నీకెట్లు తెలిసెను?

లక్ష్మ—ఆచెట్టెక్కి చూచితిని. కోవిదారాంకిధ్వజము లగపడెను.

రామ—అయిన భరతు నేమిచేయదలంచితిః?

లక్ష్మ—ఇదె నా బాణము. అదెవాని వక్షఃపీఠి. ఏది కఠినమో చూచెద.

రామ—అట్లేటికి?

లక్ష్మ—నిన్నుఁగాదని తాఁబట్టముగట్టికొన్నది చాలక, మహాగర్వసంరంభమున మనపై వచ్చుచున్నాఁడుఁగదా?

రామ—

## అనుబంధము 49

లక్ష్మణా! దశరథుని కొడుకవై, నాకుఁదమ్ముఁడవై, సుమిత్రకన్నవాఁడవై, నీవిట్లాడుట చెల్లునా? ఆరథతుఁడెవ్వఁడనియెంచితివి? నీకంటె నాకుఁగూర్చువాఁడు. నీకంటె వాఁడేమిటఁదక్కువ? నీయట్టి తామసగుణమొక్కటి వానికిఁ గలుగదు గాక. పురముచేరి పట్టమొల్లక దశరథుపంపున మమ్ముఁబ్రార్థింపఁగదా వాఁడిందు వచ్చియుండవలయు?

[ ప్ర: భరతుఁడు-శత్రుఘ్నుఁడు-(దూరమున) ]

భర—శత్రుఘ్నా! చూచితివే లోకములన్నియుఁగటాక్షమాత్రమున నేలఁజాలిన భోగి యెట్లున్నాఁడు! సార్వభౌమ సింహాసన పీఠిపై సేవాసమవేష్టిత రాజరాజన్యుల మోములకుఁ గళలుదెచ్చు విరాజన్మణివితాన ప్రభామహితంబగు కిరీటము ధరింపఁగల పూజ్యశిరంబెట్లు భూషణవిహీనమైయున్నది. చూచిన నెట్టిమానసమును నీఱుగాక పోవునే!

శా॥ గాత్రంబల్లనఁజిక్కె దైన్యము సమగ్రంబయ్యె నెమ్మోమునన్
నేత్రంబుల్ముకుళాబ్జసన్నిభములై నిస్సారతంజూపె నో
శత్రుఘ్నా! కనుఁగొన్నమానసము చంచత్కీలలన్ గ్రాఁగదే
శత్రుల్గోరరుగాదె వైరులకు నీచందంబువాటిల్లఁగన్॥

(శత్రుఘ్నునితో నమస్కరించును).

రామ—(భరతు నాలింగనముచేసి) భరతా! కుశలమా? రాజ్యమంతయు సురక్షితమా? ప్రకృతిజనుల బిడ్డలఁబోలెఁ బ్రోచెదవా? రాజాంగములఁ జక్కఁగానరయుదువా? సేవకులఁగరుణఁ బాలింతువా? గోదేవ భూదేవులఁ బూజింతువా? వర్ణాశ్రమ ధర్మములఁ బాలింతువా? జారచోరులు లేరుగదా? ప్రభుమంత్రోత్సాహశక్తులసామ దానభేదదండములఁ జక్కఁగానెఱిఁగితివా? షడ్గుణంబులగ్రహించి సప్తవ్యసనముల మాని చతుర్దశపాపంబుల వర్జించి హాళికులకు దుఃఖములేకుండఁ గోరికిఁగొంచు సత్యైక వ్రతుఁడవై ధర్మైకనిష్ఠుఁడవై సర్వసముఁడవై యున్నాఁడవేకదా? తమ్ముఁడా! నీవేల యిందురావలయు? ఎవ్వరితోడనైన నీక్షేమోదంతము మాకుఁజెప్పిపంపి యుండినఁజాలదా? అదియేమిట్లు కన్నీరు నించెదవు? నాకొఱకువగచెదవా? లేక నీకొఱకా?

భర—అన్నా! ఎవరికొఱకేల నాకొఱకే వగచెదను.

రామ—తమ్ముఁడా! మనవారందఱికిని సౌఖ్యమేకదా?

మ త్త॥ రాజపూజితుఁడల్ల తండ్రి ధరావిభుండు సుఖుండెయా
రాజదేవులుతల్లులందఱు రాణనుండెడువారలే
భూజనంబులునిన్ను భక్తినిఁ బూజచేసెడువారెయీ
యోజఁగన్నులనీరుగారె నయోయిదేటికిసోదరా॥

భర—హా! నిర్భరము.

రామ—భరతా! ఏమినిర్భరము? నాపాదుచెవులకు నీనాఁడెట్టివార్తఁజెప్పనున్నావు?

భర—అన్నా! ఇంతకువచ్చి సంకోచమేల?

గీ। మనకులాధ్యుండు మనరాజు మనగురుండు
మనసుదైవము మననిధిమనధనంబు
మనదు భాగ్యంబు మనవాసి మనబలంబు
మనసుకృతరాశి మనతండ్రి మనకు లేఁడు॥

[ ప్రవేశము: వసిష్ఠుఁడు (దూరమున) ].

రామ } హా! జనకా! జనకా! (మూర్ఛిల్లిలేచి).
లక్ష్మ }

అనుబంధము 50

రామ—మాతండ్రి మము ముద్దుచేసి పెంచి కాపాడినతండ్రి సత్యప్రతిజ్ఞుఁడై, కరుణా గుణభూషణుఁడై, చిరరాజ్యమేలినతండ్రి మాకు లేఁడయ్యెఁగా. కటకటా! ఎట్టి పాపపువార్త—

వసి—రామచంద్రా! సకలతత్త్వవేదియైన నీకిట్టి ప్రాకృతభంగియేలకలిగె? సహింపుము. నీముగ్గురుతల్లులు నినుఁజూచుటకై వచ్చియున్నారు. నీపాటునకు శోకఘూర్ణమాన మానసులై యున్నారు. వారినూఱడింపుము. సోదమురమ్ము.

(నిష్క్ర)

పంచమాఙ్కము-ద్వితీయరంగము.

అ ది యే ప ర్ణ శా ల.

[ప్ర: రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు, వసిష్ఠుఁడు, సీత, కైకేయి కౌసల్య, సుమిత్ర, కూర్చుండి భరతుఁడు (జడలతో)].

భర—అగ్రజా! నమస్కరించి విన్నవింతును. నీవులేని వైకుంఠపదవియైన నొల్లనను నీవెఱుఁగవా? నీపభిషేకమున కియ్యకొన్నను విహితమే. ఈరూపముననే నను నీదండనుండ సమ్మతించినను విహితమే.

రామ—భరతా! ఈజడలు నారచీరలు నీకేల? మనజనకుఁడు నినుబట్టమునకు నియమించియుండ నీకు జరుపకున్న నెట్లు?

భర—జనకుని యాజ్ఞతెఱంగున రాజ్యమే నాయదిగదా? నిశ్చలమానసమున నేనీకిచ్చుచున్నాఁడనే. ఏల యనుగ్రహింపరాదు?

రామ—పదునాల్గేండ్లరణ్యముల నుండెదనని నేవచించితినే. అదితప్పుదునా?

కైక—రామా! నాకొఱకైకదా నిన్నుజనకుఁడరణ్యములకనుపుట? వరములడుగుట కెట్లో వానివదలుటకును నాకు స్వాతంత్ర్యముగలుగదా? నేనే యిప్పుడువలదనుచున్నానే. నీకేటికీ ప్రతిజ్ఞ?

## అనుబంధము 51

రామ—జననీ! ఎఱిఁగి యెఱిఁగి యిట్లేలాడెదవు? నాకాజ్ఞయొసఁగినవాఁడుజనకుఁడు గదా? అతఁడు లేఁడే అతఁడుండి యామాటచెప్పియుండిన నెట్లగుచుండెనో కాని యిప్పుడు తిరిగిన నధర్మము.

కైక—మృతిబొందువఱకు నన్ను నానాథుఁడు కన్నెత్తిచూడఁడాయెనే.

భర—అన్నా! మావిధియిట్లున్నది. దశరథునకుగాక వ్రాయరాదని యీ సంయమీంద్రుఁడు జనకుఁడు చచ్చువఱకు జాబే నాకువ్రాయఁడాయె. నేనేమిచేయుదును? పోనీ, దశరథుఁడు పిలిపించియుండిన వచ్చుచుంటి నంటివికదా? ఆ దశరథుఁడేల నిన్నరణ్యముల నుండుమనియె? ఈకైక కైగదా? ఆయమయే యిప్పుడు తనకు వరములు వలదనుచున్నది. ఇప్పుడు దశరథుఁడున్న నిన్ను రావలదనుచుండెనా? ఉద్దేశమింత విచారింపవలదా? నీవెట్లయిన రక్షింపకున్న నేనన్యథాగతియెఱుఁగను. నీవు రాజ్యభారము వహించియున్న నీభృత్యుఁడనై యెట్టికార్యములైన నెఱవేర్పఁ జాలుదుఁగాక, తాపసవృత్తినీవీయరణ్యముల నిట్లుండ నెట్టి సంతోషమున నేరాజ్యమేలుదు? ఏయూఱట నేనీపృథ్వీభారము వహింతు? కరుణావిశేషమునను, దేజోమహత్త్వమునను, గీర్తిప్రతాపముల వైఖరిని, సత్యనిష్ఠఁ జేసియుఁ, ప్రభుత్వమహిమాదిశక్తివిశేషములను, లోకములెల్ల నేలఁజాలిన నీకుఁదగుఁగాక యీరాజ్యము నాకుఁదగునా?

## అనుబంధము 52

(కాళ్లపట్టుకొనిపడును)

రామ—భరతా! (అని కాలువదలించుకొనును)

భర—(చేతఁజిక్కిన రామపాదుకలు పట్టుకొనును).

రామ—నీవింక నిట్లాడిన నాయాన గలదు. అవరజా! ప్రీతివిశేషమున మది దెలియ కిట్లాడితివి కాక, ముందు వెనుకలు యోచింపవే? ఆదశరథుఁడుండిన నను రమ్మని యుండు. నిక్కువమే. ఆయన లేఁడే. ఇట్టిచో నేవచ్చిన రాజ్యలోభుండనియుఁ బ్రభుత్వైక కాముఁడనియు, జనులు కొందరైన నన్నెంచరే. ప్రాణములనైనఁ బాసెదఁగాక నిందకోర్వఁజాల. దీర్ఘాలోచన మొనర్చిన నామతము మీకే శ్రేష్ఠతమ మని తోఁచకుండదు. బాధింపకుఁడు. మన్నింపుఁడు.

## అనుబంధము 53

భర—(పాదుకలఁ జేతఁబట్టి) అన్నా! నీవు కాళ్లువదలించుకొనినపుడు దైవానుగ్రహమున నీపాదుకలు నాచేఁజిక్కె. ఇంతమాత్రమైన ననుగ్రహింపుము. నీవు పురికి రాకున్నను, నన్ను నీవెంటనుండనీకున్నను, నీమారుగా వీనినైన సింహాసనముననుంచి యభిషేక మొనర్ప నానతిమ్ము. (నమస్కరించును).

వసి—రామా! ఇది నియమాధికము. ఎవ్వరి ప్రతిజ్ఞలకును భంగము రాకుండునట్లును దన యభీష్టము నెఱవేఱునట్లును వేఁడినాఁడు.

కౌస—రామా! నీయెడ భరతునకెంత భక్తియో దీననే యెఱుఁగనగుఁగదా? అట్టి భక్తిపరుని యభీష్టము నెఱవేర్పుము,

## అనుబంధము 54

రామ—(భరతు నాలింగనము చేసి) ప్రియావరజా! నీకోరికకంటె నాకొనర్పఁదగిన దేమున్నది? తల్లులారా! మీయానతి మీఱుదునా?

భర—ఆహా! లలనీకృత ప్రస్తరనిజక్షోదములే! రిపుశిరస్సంఛేదములే! క్షోణీభరణమర్యాదములే! అవ్యయమార్గప్రసాదములే! కమలినీకృతవివాదములే! అపగతలోకనిర్వాపములే! ఉజ్ఝితవిషాదములే. లతాంతామోదములే! విలగ్నశ్రీకుచస్వేదములే! ప్రక్షాళితభూకాంతిముఖమృగమదశాపములే! ఆసురావళీగర్వనిర్భేదములే! ఆలంబితసహాంతవేదములే! ఈపాదములు. భళిరే. తమోహరణ తరుణారుణ కిరణములు, సర్వలోకభారభరణములు, శ్రుతిశిరోలంకరణములు, భవసాగరతరణములు, సుధీజనమహితాభరణములు, ఈచరణములు. ఇవి నాకు లభించెఁగా! నాకామోదము నించెఁగా! మనఃఖేదము హరించెఁగా! నాసుకృతము మించెఁగా! నాయభీష్టముఁ జెల్లించెఁగా! సంయమీంద్రా! నీవిడిన లగ్నమున రామున కరణ్యవాసము లభించెనని యయోధ్యలోని మందబుద్ధు లనిరిగదా? ఆలగ్నముననే మాతల్లిచేఁ గావింపఁబడి రామునకు నిష్కారుణచే నేపాదుకలొసంగఁబడెనో, వానికే

పట్టాభిషేకము గలిగెనే? ఆహా! యెట్టిలగ్నబలము! రామచంద్రా! ఆపాదూరగు నట్టియు, నీవరణ్యమున కేగిన జ్ఞాపకమును, దశరథుఁడు కాలధర్మము నొందిన జ్ఞాపకమును దెచ్చునట్టియు, నయోధ్యనే నుండఁజాల. నీపునర్దర్శనమవుటవఱకు దాని గన్నెత్తియయినఁజూడను. నందిగ్రామముననే యుండెదను. రామా! నాకుసెల విమ్ము. ఇదె యీపదునాలుగు వర్షము లెట్లయినఁగడపెదను. పదునాల్గేండ్లును బదునాల్గుగడియలుగాఁగడచన నభిలషించు నాకు నీవియోగకారణమునఁ జేసి పదునాలుగుగడియలే పదునాల్గువత్సరములుగాఁ దోఁపఁగలవు. అయినఁగడపెద. ఎట్లోగడిపెద. ఆంగీరస సంవత్సర చైత్ర శు|| షష్ఠికిఁ బదునాల్గుహాయనములు నిండఁగలవుగదా? ఆనాఁడు నీమంగళదర్శనము నాకుఁ గలుగకుండిన మనఁగాల. నిక్కముగా మనఁజాల. తల్లులారా! ఇాదుండుకొలఁది వియోగము వలని దాహమగ్గల మయ్యెడు.

## అనుబంధము 55

## అనుబంధము 56

సైక—భరతా! జాబుమఱచితివే.

భర—అన్నా! శత్రుఘ్నుఁడు కుత్తుకఁ ద్రొక్క ప్రాణమాత్రావశిష్టయై యాఱుదినము లుండి మంధర మృతిఁబొందెనని యెఱిఁగితివికదా? అది మరణపువేళ నీప్రతిక వ్రాయించినది. నీకిమ్మన్నది.

రామ—(చదివి) భరతా! ఎంత సకరుణముగా వ్రాసియున్నది. మంధరా! నన్ను క్షమింప వేఁడవలయునా? నాకేమపకారమొనర్చితివి? నిక్కముగా క్షమించితి.

భర—అన్నా! మఱియొక విజ్ఞాపనము. ఈపాదుకలకుఁ బట్టాభిషేకమీయెడనే యొనర్పవలయునని నాయభిలాషము. అయోధ్యకుఁ బోవనుగదా? ఇఁక నందిగ్రామమునైననేమి? ఇండైననేమి? నీసాన్నిధ్యముననే యొనర్చుట భాగ్యమగుఁగదా?

రామ—తమ్ముఁడా! నీకెట్లభీష్టమో యట్లనే కానిమ్ము.

భర—(పాదుకలకుఁ బట్టాభిషేక మొనర్చును).

## అనుబంధము 57

—(మంగళం)—

# అనుబంధములు.



అనుబందధములు.

1. సూత్ర—శ్రీరాగము-రూపకతాళము.

అమరావన-విమలానుత-కమలాసన-మారమణ ॥పల్లవి॥
సమదాసుర దమనానీకు-నమస్కృతులు-పీతాంబర ॥అను॥
ఘనాగమను-తనామనిను-వినాదైవమెఱుఁగ
అనపాయ-పదముగోరుచు-సనకా-దినుతా-వినతా
వనశీలా-నినుఁగొల్చితి ౧
అపారఘన కృపాలిత-సుపావనారిపుహరా
విపాకముల నెడలించుచు -నపరాధపగుణ విపులా
ధిపనన్నుం-గృపఁజూడవె ౨
నా-మనవినివినవే-ననుదయఁగనవే యనవరతము
తిన్నని-విన్నప. మెన్నుచులో-కా-ధా-రా-
కారణ-వైరిని-కారణ-వారణ-తారణ-శుభకర ॥

2. నటి—రాగము-మోహన-రూపకతాళము.

ఘనవేణి-యజరాణీ-వనరుహకిసలయపాణీ
ననుదయఁజూడుము రాణి-కనికరమునవాణీ
అనుదినసుతగీర్వాణీ-కనదనుచరదింద్రాణీ
వినతాశ్రిత-జనతావహ-సునయనవిజితైణీ
జననుతసైవతమాణీ-ఘనకల్యాణీ ॥

3. దశరథుఁడు — రాగము-శంకరాభరణము-ఆదితాళము.

ఇంతఘోరవిధానమాయెనే ||పల్లవి||
ఇంతయైనఁజూడకీధరాసురునినంతమొందఁజేసినాఁడనయ్యయో
పెల్లుశోకమునఁబెంపుదక్కివీనితల్లిదండ్రులెంతతాపమొందుచు
తల్లడిల్లువారో తాళఁజాలనే నొల్లనొల్లవారి కొప్పఁజెప్పవీని

4. దశ — రాగము-ఝుంఝూటి-తాళము.

పావన మౌనిపుంగవమా ఓ
కావకుమా యోడకుమా చూడకుమా బ్రోవకుమా ||ప||
ఓపిననిర్దయనీదు పాపనిజంపిన
పాపమునకునాకు శాపమొసఁగరాదే ౧

5. రామ — రాగము-కేదార-రూపకతాళము.

రావలదే తమ్ములిటకును
భూవరనుత ధీవిదిత ||పల్లవి||
చిన్నతమ్ములిందురాక చేయనేటికి
కన్నతండ్రివేఁడువాఁడ నున్నతివలదెన్నఁడైన ౧

6. దశ — రాగము-మోహన- ఆదితాళము.

తనుజాతా యేలుమా
భూతలమంతయుఁ బ్రీతిజనింప
వారకనీకిటు పట్టముగట్టిన
ధారుణినాదగు భారముదీఱు

7. కైక—రాగము-కమాజు-ఆటతాళము.

నేవినఁజాలను వెలఁదీ వలదీ-కోలఁది
జగదభిరాముని జానకీకాముని
తెగడెద వేటికి నగునే తగునే-పగయేమె ||నేవి||

8. కైక—రాగము-ముఖారి. ఆదితాళము.

హా హాయిది యెంతపాప మహాహా ||పల్లవి||
ఇంతటిమాటల నెటులాడఁజాలితే
సంతాపమెంత దురంతమాయె ||ఆహా||

9. కైక—రాగము-హిందూస్తానిఫరజ్.

మంథరా-నన్నిటు కావే యో ||ప||
మునిఁగితివనధిని నను దరిఁజేర్పవే
కనికరంబునను-గాపాడవె యో ◠

10. దశ—రాగము-ససరోజ-ఆదితాళము.

వింతలాయె కామినిఁజూడఁగ వింతలాయె
ఇంతిరో నీవిటువంతలఁజెందుట వింత||
నారిమణినే చందముచూచిన వింతలాయె
భూరివిచారమొ కోరికరీతియొ కూర్మివెలార్చుట ||వింత||

11. కైకా—రాగము-నీలాంబరి-ఆటతాళము.

మోసపోయితినయ్యో నాథునినమ్మి
ప్రాణనాథుఁడు నన్నుఁ బ్రాణపదముగాఁగ
దానెంచుననిమది నేనమ్మియుంటిని ◠

12. దశ—రాగము-కమాజు-రూపకతాళము.

కోరకుమా సరసీరుహావదనా
మానిని యీక్రూరభంగి మానుదీనుపై
ఓ-చానసూను-గానఁదోలు-టి నెఱితగునే

13. దశ—రాగము-కేదార-ఆదితాళము.

చెలి యీపాటు సైరింపనే
హా-నాపుత్రునాకీయవే (నాపట్టినేఁబంపనే)
నీకేలంటి కాలంటినే నీలాగు వేఁడంగనీ
జాల మేల తాళఁ జాలబాళి లీల బాలా

14. రామ—రాగము-కానడ-ఆటతాళము.

చూడవేల మాటాడవేల
నేఁడిదేటికీ శోకములీల
(తండ్రినీ-వాఁడనుగానో)
నామీఁదకోపమొ ప్రేమముచూపవు
రామా యనిపిల్వ వేమపరాధమొ॥

15. రామ—రాగము రాగమాలిక-రూపకతాళము.

జనకా నీకిటు లేటికి-ననుతాపము జనియించెనో
మనసారగ నాకార్యము వినుపింపఁగదే॥ ॥కాంభోజి॥
మించినతమినే భూతల సంచారము నొందవేమది
నెంచితి దానికినిటుశోకించఁగనేలా ॥కేదారగౌళ॥
నాసోదరుఁ డతికరుణా భాసురుండాభరతుఁడు
నీసూనుఁడు రాజగుటకు గాసిలవలెనా ॥దర్బార్॥

ఎడరేయిది కైకేయియుఁ గడుకూరిమి గలతల్లియె
అడుగఁగరాదే వరముల నడలఁగనేలా ||మోహన||
నీకై యనలముఁజొచ్చెద నీకొడుకను నీదాసుఁడ
నాకానకుఁబోఁజాలనే శోకమిఁ కేలా ||శహాన||
గాసిల్లకు మిదెవచ్చెదఁ గౌసల్యకు వివరించెద
నాసీతకుఁ జెప్పెదనా యాసమువలదు ||శంకరాభరణ||

16. కౌస—రాగము-ధన్యాసి రూపకతాళము.

ఈవిధమున కేమిసేయుదు ఇంకెందుఁబోవుదు
బాలమన్మథనిన్నుఁగానల పాలుచేసిశోకమే
లీలనీగుదుప్రాణసమితి తాళుదాననే ౧
కైకగర్భమునందుపుట్టక నాకుఁగల్గినందున
భీకరాటవులకుఁబోయి తేకుమారక ౨

17. రామ—రాగము మోహన-ఏకతాళము.

ఇటువేకారినీకేల శోకింపఁగాఁదల్లిరో
సుశ్లోకవు నీవెందునుచాలు ||ప||
నీమాటపైనమ్మరో నేసీమాడ్కినిందుండిన
భూమిధవు నేమనమ దేమగుస తీమణిరో
యీమాటలాడకుమోమాత ౧

18. సీత—రాగము-ఆఠాణ రూపకతాళము.

అపరాధమేమి నాథానాయెడ ||నప|| ||ప||
తపియించి కుందురీతిగాఁ గృపమాననేమినేఁ జేసితి
ననునీవు బాసిపోవ మనియుందు నంచునెంచితే
వనభూమి నీవుచేరఁగా మనసారవీఁట నేనుందునే ౧

19. రామ—రాగము-కమాజు అటతాళము.

భామా చన దీమానసము నామోహాపు ॥ప॥
ప్రేమాయతి నీమాటల నేమాడెదవో మానిని ॥అను॥
బాలామణి హేలావతి వాలాయము
చాలావెతఁదూలంగనిఁ కేలామఱియాలాగువ ౧

20. సీత—రాగము-బ్యాగు రూపకతాళము.

పాదములాన నీ-పాదములాన
కావనకీ శోకసాగర మీఁదఁగఁజాల ॥ప॥
భూపతిలకమేనఁబ్రాణ మోవదుండఁగా
నాపయినీబాలఁజంపు పాపము రాదా ౧

21. కైక—రాగము-శంకరాభరణము ఆదితాళము.

భూపాలుఁడేమైపోవునో ॥ప॥
పరితాపముగలిగె ॥అను॥
ఎంతని చెప్పుదు సంతాపవైఖరి
అంతముగానని చింతలరమణీ ౧

22. కౌస—రాగము-కానడ ఏకతాళము.

కటకట కాంత-యెటువలెనింత
పటుతరచింత-పడియెదో వింత
నీకైకపట్టికి నీరాజ్యమిమ్మఁక-నాకూర్మిసూనుని
నాకిచ్చి కావుమా ౧
సుమి—నీరాముడెంతటి నేరము జేసెను
ఘోరాటవులను జేరంగనాథ ౧

సుమిత్ర { వైరులకైననువలవదీ దుఃఖము
కౌసల్య { ఏరీతిఁదీర్చెద వో రాజశేఖరా

23. దశ—రాగము-కేదార రూపకతాళము.

నీరజముఖులారా వర॥ ॥ప॥
నేరమించుకైన నెఱుఁగనిజ మీరక్కసిసాధించెను
కోరిభూరి వైరము॥
కనికరమింతైననుగనకీ వనితవరము లనియడిగెను
ఘనమగుపరితాపమడరెను మనఃజాలఁగద మనసులకనుఁ
గనలకుఁడిఁక ౧

24. కౌస—రాగము ఆనందభైరవి ఏకతాళము.

వర తమాల వేణిరో వాదా నా
కుమారుఁదయఁగనరాదా ॥ప॥
బాలావైరము లేలా కోపము-మేఁగా-ననుదయఁజూడుమింకః
జాలా బాలుని వేలార్పకు హేలాగుణ జాలా ॥వర॥

25. కౌస, దశ—రాగము- సురటి ఆదితాళము.

ననుఁదలచిదయఁజూడవే సతీ
కొనకిదేలాయింత కోపముఁబూనఁగ ॥ప॥
కైక—ఇదితగు నెకడునారడిభళీ
మదినినామాటింక మానఁగఁజాలనే
కౌస—బాలావైర మేలా నేర మేమీ పరమాదరణ విడఁగ ౧
కైక—మేలీ మాటనాదే నేరమామె మెలఁతా వలదీ-పలుకు
దశ—ఈరీతి మేరాచ కోరాక్షి వైరము ఇరవారఁగరుణింపు
భరమా యెతాళ ౨

కైక—ఇంతేల నా మీద-బంతంబుఁజూపఁగ
నెడఁబాయు పెడరొనె మిడుకంగ ॥నిట్టు॥ ౨

కౌస—సన్నుతాంగి విన్నవించు చున్నదాన నన్నుఁబో్రవసరసము
తగునె సురచిరగతినీ కరుణవదలకే నిరతము ౩

కైక—మాటిమాటి కాటలానే పాటిరాని మాటలేల మగువరో
యిదియుం బగయనందగునే సొగవులవగలే తగదింక ౩

దశ—నా మనవివినవే కిసుకవలదే వనజనయనా మనసునను-గొన
కొనియిఁక నే మనదలఁచిననీ పనివిడువఁగదే పణతిరో ౪

కైక—నా కకటచనునే వెకలిమనవుల్ వికటమతినే సుకరముగవిక-
లములగునా టకరచనలనిం దకు గుటిగోలుపక ప్రకటము ౪

కౌస—సరసిజముఖనీ భరతునినిపుడే ధరణిబిలుపుమె వ్వరువలదనరీ-
చరితము శుభకర మతిసుఖ కరమగు నిరతము మదిమదిగను
గొని యెదమిఁక నరాళ శిరోజ కుమారు నరణ్య నివాస
విరోధ-మేల ౫

దశ—విలసితమతివై వెలసిననతికీ తులువతనమునీ కలవడఁదగునే
చెలియరో నిజముగ మననిఁక బలుదయ వలసిన ననునిట్టుబ్ర
దుకఁగఁ బనువుము పలాశి విచార మిదేల విలోల విలోచ
నలాతినటె ౫

కైక—కొడుకు నకనినే నడిగినవరముల్ దుడుకు తనముగా నుడివెద
రకటా కొడుకును గొనియెద యడవులఁ బడియెద కడుముద
మడరఁగగఁడుకొని మనుఁడిఁక నెడందఁ గడింవి వెడంగు
కిడంగి యడంచు టిదేల ॥యిట్టు॥ ౬

26 సుమి—రాగము-ఇంగ్లీషునోటు-ఆదితాళము.

సరసిజలోచనచూడవే తరమగునే భీ-కరమగుచందము ॥ప॥
శ్రీకరుండగు రాకుమారుని భీకరాటవిఁ జేర్పకుమా
వీఁక చెడుబలు కాకతగదిది కైకనీకును గరుణయుఁగలుగదే ౧
మానక దశరథుసూనుని నో-మానివి కానకుఁకుఁబం పెదవే
చాన-నాకును-సూనులిరువురు పూనివలసిన-వాని
నుంచు కానలోన ౨

27. సుమి—రాగము-హిందూస్తాని-చాఫ్‌తాళము.

సుందరాంగి కైకేయినీ కెందు కేయీ క్రూరభంగి॥ డెందమునఁ
గరుణ లేక మందయాన మమ్ము నెల్లఁగుందఁజేయు టేటికమ్మ
కానలోన దశరథుసూనుఁడుండఁ గోరితేని మానవతి నాకిద్దఱు
గానవారిలోన నొకనిఁ బూనిపంపు సోదరినీ కెందుకింత ౨

27. కాస—రాగము ఆనందభైరవి-ఏకతాళము.

కైకా మానవె కాక రాముని పోక భరతుఁడు వచ్చెడు దాక
చేకొను మీ కైవడి పోకార్పకు వీఁక ॥వరతమాల॥

28. కైక—రాగము-కేదార-రూపకతాళము.

పోలదె మీ మేలిపల్కులు-ఇంకేలా చాలును
బాలఁగానను గోలఁగాఁగొని గేలిచేయఁగఁజాలువారివలె
వెలయఁగమీమాటలఁబలు విన్నాణము నిండారెను
తలఁపకుఁడీనన్ను మోసము సలుపుమాట సవతులార॥

29. లక్ష్మ — రాగము-దర్బారు రూపకతాళము.

వింటి రేసదస్యులారా వెలఁదిమాటల
కంటగించియాడువాలు గంటిచందము॥
క్రూరభంగినీమెమగనిఁ గోరెవరముల
తారతమ్యమరసికనుఁడు ధర్మసూక్ష్మము

30. లక్ష్మ—రాగము-కేదారగౌళ ఆదితాళము.

కోపము చేఁగడు పాపములనాడితి
భూపతిలకనాకు శాపమొసంగవె
తాళగతల్లినిఁ దండ్రినిదూరితి
పోలదీపాపపు నాలుకఁగోయంగరాదె॥

31. రాగము-భూపాళం ఆటతాళం.

రామ, లక్ష్మ, సీత } చాలా మీరలడలవలవదీ వేళ
ఈలోన నేమరలిచ్చెదము వెగమెయింకేలా

దశ, కౌస, సుమి } బాలా తాపమెట్లుఁదాళుదుమీ వేళ
నీలాగాయె మానోముఫలము చూడఁగనింకేలా ॥ప॥

రామ—కళవళింపకుఁడింక మాకయి బలముగాఁదలిదండ్రులారా
తలఁపరే పసుపరే పలుకరే నేమముగ
సీత— నతులొనర్చెదమధికభక్తినిఁ బితరులార శుభంబుగోరుచు
వెతలఁబోవిడిచిమ మ్మనుపరే సౌఖ్యముగ ౧
లక్ష్మ—నేమనంబిదుఁడింకసీతా రాముల వెనువెంటఁబోయెద
ప్రేమతో నేమమే కోరుఁడీ పంపుఁడీఁక ౨

సుమి—రామనీదుహిమాంశుఁబోలిన మోముఁజూడఁగ మరలగల్గెదు
సేమమింపారఁగా లీలమైపోయిరము ౩

కౌస—అడవులనుఁబాలించినాదగు కొడుకుగోడలిమరలనాకె
ట్లిడియెదో బాలకా లక్ష్మణా సేమముగ ౪

దశ— పాడిమెఱుఁగకనిన్ను నీపతితోడఁగానలకంపుటిదియే
జాడయో కోడలాచేడరో చూడకిఁక ౫

32. పౌరులు—రాగము-శంకరాభరణము ఆదితాళము.

దిట్టతనంబునవెడలండి గట్టిగధైర్యముపట్టండి
పొట్టలుఁడొక్కలుచీల్చండి కట్టెలగంపలఁగాల్చండి
రాముని కానలలోఁజేర్చి తామసించిరిటుపోకార్చి
మోమోటంబడివిడువండి ఆముండలవడిబాడవండి ౧

కైక రాజసతియగునేమి కాకాముంధరముందేమి
లేకున్న సుదశరథు డేమి పోకుండఁగబడిమొత్తండి ౨
బద్ధనమేర్పడనిలుపండి కడ్డాయంబుగఁబిలువండి
అడ్డమువచ్చినవారలను గొడ్డంటనుఁబడఁగొట్టండి ౩

33. రామ—రాగము-హిందూస్తాని-ఆదితాళము.

పౌరులార వేఁడువాఁడ-భూరికరుణఁజూడుఁడి
ఘోరపాపకార్యమాయె-ధీరులారవీడుఁడి
భూతలేశుభార్యమీకు మాతగాదొయెంచఁగా
భీతిలేక చేయువారె మాతృహింసమించఁగా ౧

34. దశ—రాగము-ఝుంఝూటి-రూపకతాళము.

రాఁగదేనన్నుఁజేర రథముమాని రాఘవా ॥ప॥

ఈశనుమంత్రుఁడిట్లురథము నీసు చేసితో లెఁగా
భాసురాంగునన్నుఁ బాపఁ జేసిపాపియయ్యెనే
ప్రేమమీఱనరదమింత తామసింపనిల్పుచు
నేమహాత్ములైనమా రాముమానునివ్వరే

35. కైక—రాగము-పీలు-ఆదితాళము.

ఎంతద్రోహపు కార్య మొనర్చితి
ఎంతలెంతో వచ్చునాకును ||ప||
భూపాలునిమది కాపగదాయనై రూపుమాపితి
దోఁపదాయె నుకింతయుఁ-దోఁపదాయె
నేపువో యె-పాపమాయె

36. దశ—రాగము-సావేరి-ఆదితాళము.

నే నేమితప్పు చేసితినో-రామా
దీనరక్షకనన్ను దిలకింపరావే ||ప||
ప్రేమ చూపవునాపై-నేమి నేఁ జేసితి
రామాయాలింపవే-నామనవి
ఈమరణము వేళ-నేని చూపవె నాకు-నీముద్దు గాలు నె మ్మోము
కుమార ౧

37. రాగము-ముఖారి-ఆదితాళము.

కౌస } వెడలితే ప్రాణేశా-
కైక } కడుదయ-మాని తేమాపై

కౌస—చటులతసూను ని నటపులకంచి
పటుతరశోకముపాలై-కటకటమమ్ముఁబాసి తే ౧

సుమి—మోహామునించుచు-ముద్దులసతియని
యీహాజెల్లంగఁగవింతై-ద్రోహామదేమినాథా ౨

38. కైక—రాగము-హిందూస్తాని-ఆదితాళము.

జనలోకపాలా-ననుఁబాసితే
దీనతవాటిల-నానేరమెంచుచు
పోనాడనీదయ-హానాథపోయితే ౧
వరములడుగనీకెఁ-గరుణించిచూడుమా
భరతునిమానియీ-పరిరామునిల్పుచూ ౨

39. రాగము-భోగిసావేరి-ఆటతాళము.

కావవె-కావవె-కావవె ॥ప॥
హా-ప్రాణేశపాసితెమమ్మ దయ-లేనిచందముదోఁచెనుమ్మ-
కరుణానిధిమనవిఁజేకొమ్మయీప్రాణమెయింకభారము
నీవు-లేనిదెమనమింతమ్మ

(రెండవ యవనిక పడును)

మ-మ్మారయకనదలఁజేసి-నేఁడూర కేమము నెడఁబాసి
పోవ-వైరులమేగుణరాశి-కడ-తేరెనెమాబలువాసి
మను-వారమెనినుఁదలపోసి ౧

(ముందు యవనిక పడును)

40. భర—రాగము-తోడి-రూపక తాళము.

పురిదాఁపున-కరుదేరగఁబరికింపవెయరిసూదన
పరితాపము-భరియించుట-యరుదాయెఁగదే

చేతోభయ-మీ తెఱగున-నీతాపము-నోతమ్ముడ
ఆతల్లుల-కాతండ్రికి-నే తెఱగదే

41. కైక—రాగము-శాహన-ఆదితాళము.

అయోయి కేగతి-వియోగతాపము [illegible] ॥ప॥
పాపబుద్ధినీవునన్నుఁబాడు చేసితి
భూపమాళితోడనేను-బోవఁజాలనైనే-యయో ౧

42. శత్రు—రాగము-హిందూస్తానితోడి ఆటితాళము.

తామసమాయె నేమని యింక-రామునిఁజూచువాఁడనో
యీతరి నింక భూతనుజాత-సీతమగాంచఁగూడదె
మాతయె యింత పాతకియాయెను-ప్రీతిదలంగవైవసగా॥

43. భర—రాగము సాలేరి-రూపక తాళము.

మనఁగలనే- ఆహా
ఆ-మనుజాధిపు రాముఁజూడక ॥మన॥
వనభూమికిఁదనుఁబంపిన-ఘనపాపి యౌకైకకు
జనియించితినని రాముఁడు-నను నేఁ[illegible]సంగంబుఁజూచిన ॥మన॥ ౧

44. కౌసల్య—రాగము-ఆభోగి ఆదితాళము.

హా హాయిఁక నేదిదారి
ధరణీశ రాముని పురిఁబాయఁజేసియు
భరతునినైన నను-బరికింపవైతివే ౧
ఆకైకకోరికఁ-జేకొంచు రాముని
లోకాభిరాముని-నాకానఁజేర్చితే॥ ౨

45. భర—రాగము-కాపి ఆదితాళము.

వీర-మాతా-దయఁజూడకే
చింతింపకమ్మనా-యంతముఁజేయుమా
ఇంతయైనఁగీడు లేదు-సంతసింతునే ౧

46. కౌస—రాగము-తోడి-ఆటతాళము.

అన్నరో తాపంబు చేసీ-పిన్న మాటలాడితి
పిన్న మాటలాడితి
నిన్ను వేఱె-రాము వేఱె-యెన్నుదానఁగాను
ఎన్నకయీమాట లెల్ల-మన్ననంబు చేయు వే ౧
పెల్లుగామాప్రాప్తికినీ-తల్లి యేమి చేసెను
చెల్లఁబోయాకైక నేలా చెడ్డమాటలాడెదు, ౨

47. కైక—రాగము-బిలహరి రూపకతాళము.

ఘోరపాతికినే-సారసాక్షిరో-చంపుమునను
క్రూరవరముఁ-గోరిచంపితి ధారుణీ పాలుని ॥ప॥
భీతిఁగానక నీతనూజుని-నీతల బలు-నూతఁద్రోసితి
మాతనేఁబతి-ఘాతుకిననుఁ-బ్రీతిఁజూడకుము ౧

48. లక్ష్మణ—రాగము-బిలహరి రూపకతాళము.

పని-బంపునన్ను-నింపుమీఱ-సొంపులింపెద
నను-కంపమాని-జొంపినింపి-చింపిచంపెద
అదె-వైరిదారిమేఱమీఱె-చేరఁదేఱెఁగా
ముద-మారఁజేరి-చీఱికేఱి-పోరెద

49. రామ—రాగము-శహన-రూపకతాళము.

మేలా యెనిట్టిమాటలీ వేలీలనాడితి
చాలా యెంజూచిచూచినీ-కేలాగుగఁ గ్గెనో
నాకూర్మిసోదరుండవై-యీకీడు లేటికి
నీకేమి కావరంబొకో-కాక వివేక మో॥

50. రామ, లక్ష్మ—రాగము-శహన-రూపకతాళము.

మనగలమేయిఁక-జనకా ॥ప॥ నినుఁగనక ॥అ॥ ॥ప॥

రామ—సేమము జింతించుచు నా మోదము కన్నీరనఁ
ప్రేమముదైవారఁగ రామా యనుచుంటివె ౧

లక్ష్మ—కోపముదగదని-తీపారఁగబోధించితి
పాపముఁబాపిననుఁగా పాడవెచూడవె ౨

సీత— పీడకనాముద్దుల-కోడలనిమన్నించితి
చూడకనన్నోనృప చూడామణిపోయితె ౩

51. కైక—రాగము-యదుకులకాంభోజి-చాపుతాళము.

రిపు భీమా-దయఁజూడుమా-నీ-పీమాట
లేమా యిదామన్న నా-ప్రేమము పీడఁగ-రామయి దేల॥
నోనాడి కాననము-లోనఁద్రోసితినని
పోనాడకుమునన్ను-నా నేరము లెంచకుము॥

52. భరత — రాగము-బ్యాగు రూపకతాళము.

ఇదితగు నె-రామా-ఇది
నీ-పదదాసునిఁ-బారదోలుట
విను కేటికినీ కేతగు-నసియాడుమనముమానుము
పసిబాలుఁడ-నవివేకుఁడ వసుధాతలమేలఁజాల ౧

53. రామ — రాగము-ధన్యాసి-రూపక తాళము.

జన కాజ్ఞమీఱనాకుఁ జనునేకుమారక |ప||
వనభూమిమాని నే-జనుదేరఁగానను
ఘనరాజ్యకాముఁడంచు-జనులెల్లఁదిట్టరే
మనసున ననుఁగనలకుమిఁక ౧

54. రాగము-కానడ ఆదితాళము.

కౌస — పరికించితెకుమారక-భరతునిభక్తిని
కరుణించిచేయుమీతని-యరుదారుకోరిక
సుమి — ఘనాశమీఱఁజేసెసీ-మనోభిలాషము
వినంగఁబోలుదీనినో-తనూజచేయవే ౧
కైక — కూరిమిపిన్న తమ్ముఁడు-కోరినకోరిక
దూరంబు సేయబాడియే-శ్రీరామచూడవే ౨

55. రాగము-కాపి ఆటతాళము.

కౌస —
కైక —
సుమి — } ఊరికినిబోవమన నేరీతిగ-నూరడిలు
భర — సారెకునునీరాకయె-కోరుచుందు-మోరాఘవ
శత్రు —

కౌస—పున్నమచందురుని సున్నతిఁగాంచుగతిఁ-జెన్నారఁగ
నిన్నుఁగను-టన్నాయిఁక నెన్నాళ్ళకో ౧

భర—సోదరనిన్నుంగను-మోదములేకయున్న-సాదరవి-నోదా
యిఁక-భేదమును-నేఁడాళను ౨

సుమి—బాలకమేనీపదు-నాలుగువత్సరము-లేలాగునఁదా
ళుదువొ-శీలాగుణజాలాయిఁక ౩

కైక—శ్రీకరకాపాడవె చేకొనిమన్నింపవె యీకానల నీకీగతిఁ
జెకూర్చినకైకేయిని ౪

శత్రు—ప్రేమనునిన్నుంగన కీమెయి నేనుండఁగ నామానసమే
మౌనొకో యేమారదు. రామానిను ౫

56. రామాలక్ష్మ-సీత—రాగము-వరాళి-చాప్‌తాళము.

చింతింపఁగా నిం తేలతల్లులారా
వంతలన్నియుమాని-సంతోషమునఁబోరె ||ప||
ఏలయోచనచేయ-నీలాగు కడచను
నీలోనసీపదు నాలుగువత్సరములు ౧
భరత నాసోదరా పరితాపమేటికి
ద్వారలోనెమేమూరి కరుదెంచువారము ౨

---

## మ ం గ ళ ము

57. రాగము-సురటి-రూపకతాళము.

శ్రీ రా మా నా థా భూరిధ రా ధారవినత (శీలా)
మంగళం ॥మ॥
వందనీయమునిమనోర వింవసారఖేలనా
బృం-దా-ర-క-పాలా
సుం ద రార వింద లోచనా
వనరుహ భవశశి ధరసుర
వరనుత వటదళ సుశయన ౧
రామకృష్ణసుక వివినుత నామవేద గోచరా
సా-మ.జే-శ-పో-షా.భూమి-జాత-కామి తప్రదా
భామిత ధీమహీ మీా మిత పురహరి సరవర సుఖ
కర మురిహర ఖరకర సునయన ౨

పాదుకాపట్టాభిషేకనాటకము సమాప్తము.



బళ్ళారి భువనేశ్వరీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.